# చరిత్ర పురుషులు -
# చారిత్రక సంఘటనలు



ఎం. డి. సౌజన్య

జనప్రియ పుస్తకమాల
27-19-57, దుర్గయ్యవీధి
కార్ల్‌మార్క్స్ రోడ్, విజయవాడ-2.

Charitra Purushulu - Chaaritraka Sanghatanalu

M.D. SOUJANYA

First Edition
August 1959

Second Edition
May 1991



Published by
**Janapriya Pustakamala**
Karl Marx Road, Vijayawada-520002.

Price : **Rs. 15.00**

Distributors
**Pallavi Publications**
Karl Marx Road, Vijayawada-2.

Printed at
Volga Printers
Vijayawada.

# విషయసూచిక

## రచయిత్రిగా ఒక మనవి

"ఏదేశ చరిత్రయినా ఆ దేశ ప్రముఖుల జీవితచరిత్ర" అనేది ప్రపంచ చరిత్ర చెబుతున్న సత్యం. షేక్స్పియర్ చెప్పినట్టు గొప్ప తనం మూడురకాలుగా వుంటుంది. కొందరు గొప్పవాళ్ళుగాపుడతారు. కొందరు తమ కృషితో గొప్పతనం సాధిస్తారు. మరికొందరి మీద గొప్పతనం వచ్చిపడుతుంది. అర్హతలేనివాడు అనామకుడు ఏ పదవిలో ఉన్నా వాడు జీవన్మృతుడే అవుతాడు.

కానీ ప్రతిభావంతుడు ఏ రంగంలోఉన్నా, ఏ దేశంలోఉన్నా, తన కార్యాలతో, త్యాగదీక్షతో తన గమ్యం చేరుకోవడంలో ఉన్న అవరోధాలన్ని అధిగమిస్తాడు.

కాబట్టి ఆయా రంగాలకు చెందిన మహామహులను కేవలం గుడ్డిగా వీరారాధనా భావంతోకాక, వారి జీవితాలు తెలుసుకుని వాటి లోని ఆదర్శాలను తెలుసుకోవడంలో తప్పులేదు.

ఈ పుస్తకం వ్రాయడంలో నన్ను ప్రోత్సహించిన మిత్రులకు, శ్రేయోభిలాషులకు, ఈ రచనకు ఆధారమైన ఎన్నో పుస్తలకు, ఆ పుస్తక రచయితలకు, మరెందరో వ్యాసకర్తలకు నా కృతజ్ఞతలు, అభినందనలు.

ఎం. డి. సౌజన్య
లెక్చరర్—తెనాలి.

# ఆదర్శ మేధావి సోక్రటీస్

ప్రపంచ చరిత్రలో మేధావులు చాలా మందివున్నా అందరి లోకి ఆ చంద్రతారార్కమైన కీర్తి ప్రతిష్ఠలు సాధించిన వాళ్ళు కొద్ది మందే వున్నారు! అయితే వాళ్ళల్లో సోక్రటీస్ అగ్రగణ్యుడుగా చెప్పాలి.

క్రీస్తుపూర్వం 470 లో, ఏథెన్స్ నగరంలో నివసించిన సోక్రటీసు గ్రీసు దేశ వాసి. అప్పటిలో ఇప్పటిలా గ్రంథాలు, వ్రాత ప్రతులు. అచ్చు యంత్రాలువున్న కాలం కాకపోవటంవల్ల, అతను చెప్పింది అంతా సంభాషణా రూపంలో ప్రసంగ రూపంలో వుండేది. అదే అతని శిష్యకోటి వినేవారు.

సోక్రటీసు తండ్రి శిల్పి. అయితే సోక్రటీసు మాత్రం తండ్రి అందచందాలు ఏమి పుణికి పుచ్చుకోలేదు. పైగా చప్పిడిముక్కుతో లోతైన కళ్ళతో, కాస్త అందవికారంగానే వుండేవాడు. యువకుడుగా ఉండగా. సోక్రటీసు సైనికుడుగా ఏథెన్సు కోసం యుద్ధాల్లో పాల్గొన్న వీరుడు. తరువాత అతడు తండ్రి వృత్తయిన శిల్పాలు తయారు చేసే పనిని కొన్నాళ్ళు సాగించాడు తరువాత అదీ మానాడు.

అయితే క్రమేపీ సోక్రటీస్‌లో పరిశీలన, అధ్యయనం ఎక్కువయి, అతను తనకు తెలిసిన విషయాలు అందరికి వివరించటం ప్రారంభించాడు. అతని ప్రసంగాలు విన్నవారంతా అతనొక గొప్ప జ్ఞాని, విజ్ఞానఖని అని నమ్మి అతని ప్రసంగాలు వినసాగారు. క్రమేపీ అతని కీర్తి ప్రతిష్ఠలు దేశవిదేశాలకు వ్యాపించాయి. అతని శిష్యులుగా వుండి అతని దగ్గర జ్ఞానసముపార్జన చేయటానికి ఎందరెందరో అతని చుట్టూ చేరసాగారు.

అలా శిష్యులైన ప్రముఖుల్లో అగ్రగణ్యుడు ప్లేటో. అతను తన గురువైన సోక్రటీసు ప్రసంగాల సారాన్ని "డైలాగ్స్" అనే రచనలో అక్షరరూపమిచ్చాడు.

సోక్రటీసు ఎప్పుడూ తన దుస్తుల విషయం. ఇంటి విషయం, సంపాదన విషయం, పట్టించుకొనేవాడుకాదు. ఒక సామాన్య వ్యక్తిలా దుస్తులు ధరించి కాళ్ళకు చెప్పులు కూడా లేకుండా, ఎక్కడపడితే అక్కడ, గంటల తరబడి, సంభాషిస్తూ, ప్రసంగించేస్తూ లోకాన్నే మరచినట్లుండేవాడు.

అయితేసోక్రటీసు, ఎంతగొప్పమేధావో, ఎంతగొప్పతాత్విక వేత్తో తెలియని ఆయన భార్య. స్జాంతిపి భర్తను రాచిరంపాన పెట్టేది. భర్తను గయ్యాళిగా తిట్టేది. కోపంపోక ఒక్కోసారి చెయ్యిచేసుకునేది. అయినా సోక్రటీసు నిమ్మకు నీరెత్తినట్టు అన్నీ భూమాతలా ఓర్చుకునేవాడు. అవమానాలు సహించేవాడు. పల్లెత్తు మాట అనేవాడుకాదు. అసలాయనకు ఈ ఇహలోక సుఖాలు, భోగాలు, భాగ్యాలు, సంపదలు, ఒక లెక్కలోనివిగా తోచేదికాదు. ఆయన ఎప్పుడూ తన ధోరణిలో తన ప్రసంగాలు ఇస్తూ, రాత్రింబవళ్ళు గడిపేవాడు.

ఇలా కొన్నేళ్ళు జరుగగా సోక్రటీసు నేర్పిన తార్కికవిధానం నిజాయితీ, రుజువర్తనం, నిజాన్ని నిర్భయంగా బలపరచే విధానం, అప్పటి యువకులమీద బాగా ప్రభావాన్ని చూపాయి. వాళ్ళు అప్పటి వారి పూర్వీకుల్లా విగ్రహారాధన చేయటానికి ఇష్టపడటం లేదు. ప్రతిదీ తార్కికంగా, హేతుబద్ధంగా "ఏమిటి ? ఎందుకు ? ఎలా ?" అంటూ ప్రశ్నించసాగారు.

దీనితో భయపడిపోయి ఛాందసులు కొందరు ఇక సోక్రటీస్‌ను ఈ లోకం నుంచి శాశ్వతంగా పంపివేయకపోతే, తమ కర్రపెత్తనం సాగదని తమ మూఢ నమ్మకాలు వకులు ఆమోదించరని

భయపడ్డారు. అందుచేత అంతా ఏకమై "మా యువతరాన్ని చెడగొడుతున్న సోక్రటీస్ "దేశద్రోహి" అంటూ, అతనిమీద అభాండం వేసి, అతనిమీద అభియోగం తెచ్చారు. కోర్టుకీడ్చారు. కోర్టులో వాదన ప్రారంభమైంది.

"నువ్వు చేసినపని తప్పని ఒప్పుకోవటం మంచిది" న్యాయాధిపతులు సోక్రటీస్‌ను, అడిగారు.

"నా మనసుకు, నా బుద్ధికి, నా అంతరాత్మకు సత్యమని తోచిందే నమ్మాను! అదే యువకులకు చెప్పాను. అలా చెప్పటం తప్పని నేను ఒప్పుకోను!" అన్నాడు.

అది ప్రథమ తప్పిదంగా, ఏదైనా జరిమానా ధనరూపంలో విధించి సోక్రటీస్‌ను వదిలివేయాలని కొందరు న్యాయాధిపతులు ఆలోచించారు.

అయితే ఆ విషయం తెలిసిన సోక్రటీస్ దానిని తిరస్కరించాడు. దేశ బహిష్కరణ శిక్షనూ అతను తిరస్కరించాడు. అలాటి శిక్షను పొందే దేశద్రోహం తను చేయలేదన్నాడు. సోక్రటీస్ మిత్రులు ఎంత వేడుకున్నా సోక్రటీస్ తన మొండి పట్టుదల వదల లేదు, ఇక మరో మార్గంలేక విషపానం చేసి సోక్రటీసు తన దేహం చాలించాలని చివరికి తీర్పు ఇచ్చారు న్యాయాధిపతులు.

ఖైదు నుండి తప్పించటానికి, సోక్రటీసు శిష్యుడు క్రేటో, సోక్రటీసుకు సాయం చేయటానికి ముందుకు వచ్చాడు. అయితే సోక్రటీసు అతని కోరికను మన్నించక, తను పిరికిపందను కానని, మృత్యువును ధైర్యంగా ఎదుర్కొంటానని, కోర్టు విధించిన శిక్షను అనుభవించి, న్యాయంపట్ల, కోర్టుపట్ల తనకున్న గౌరవ మర్యాదలను వెల్లడిస్తానన్నాడు.

చివరిసారిగా సోక్రటీసును చూడటానికి అతని మిత్రులు, భార్య, కుమారుడు వెళ్ళారు. భర్త చావబోతున్నాడనీ తెలిసి ఏడుస్తున్న భార్యను, ఓదార్చి ఇంటికి పంపి, మిత్రులతో-చావు, బాధ, ఆత్మ, ఆత్మకు అమరత్వం-లాంటి విషయాలను గురించి రాత్రాంతా ప్రసంగిస్తూ కూర్చున్నాడు సోక్రటీస్.

రెండోరోజు సాయంత్రం సూర్యాస్తమయానికి ముందు సోక్రటీసుకు 'హెమ్‌లాక్' అనే విషమున్న పాత్ర ఇవ్వబడింది. సోక్రటీస్ శిష్యుడు క్రీటో గురువు ప్రక్కనే ఉన్నాడు.

"గురువర్యా ఇంకా సూర్యాస్తమయం కాలేదు! తొందర ఏమి లేదు!" అన్నాడు బాధగా.

అయినా సోక్రటీస్ ఆలస్యం చేయకుండా విషపాత్ర తీసుకుని కొంతభాగం నేలమీద 'దైవార్పణం' అన్నట్టుపోసి, మిగిలిన భాగమంతా ఒక్కసారిగా త్రాగివేశాడు. ఘోరంగా వున్న ఆ దృశ్యాన్ని చూస్తున్న సోక్రటీసు శిష్యులు తమ దుఃఖాన్ని అదుపులో పెట్టుకోలేక ఒక్కసారిగా ఏడ్వటం మొదలుపెట్టారు.

"ఇదేమిటి! ఆడవారిలా దుఃఖిస్తున్నారా! ఇలా తప్పుగా ఏడుస్తుందనే మా ఆవిడను ముందే ఇక్కడినుండి పంపివేశాను! మంచి శుభశకునాలు ఉన్నప్పుడు, నాకులా ఇలా, ఈ లోకం విడిచిపెట్టడం మంచిదే కదా! మీరంతా ఓర్పుతో ధైర్యంగా వుండాలి!" అన్నాడు వాళ్ళకే ధైర్యం చెబుతూ.

క్రమేపి ఆ కాలకూట విషం సోక్రటీసుమీద పనిచేయసాగింది అతని శరీర అంగాలు క్రమేపి వాటి శక్తిని కోల్పోసాగాయి.

కొంతదూరం సోక్రటీసు నడచి వెళుతున్నాడు, అతని వెనక అతని శిష్యులు ఏడుస్తూ అనుసరిస్తున్నారు.

ఇంతలో తను ఎవరికో ఒకకోడి బాకీవున్న విషయం సోక్ర టీసుకు గుర్తొచ్చింది. అది తీర్చమని శిష్యుణ్ణి కోరాడు.

ఇక కొంతదూరం నడచి, కాళ్ళు తడబడి సోక్రటీస్ నేల కొరిగాడు. అతని ఆత్మ, అతను నమ్మిన పరమాత్మను వెతుక్కుంటూ పంచభూతాల్లో కలిసిపోయింది. తను నమ్మిచెప్పిన ఆదర్శాలకోసం. స[illegible] కోసం. [illegible] ప్రాణా[illegible] బలిచేసిన [illegible] [illegible]ల్లో [illegible] సోక్రటీస్ అనేది నిర్వివాదాంశం.

## అజ్ఞాన సైనికుడి కత్తికి బలైన మహా విజ్ఞాని



అర్కిమెడీస్
(క్రీ॥ పూ. 287–213)

రోమ్‌రాజ్యంలో, సైరాక్యూస్ నగరాన్ని రాజధానిగా, హెరాన్ అనే రాజు పరిపాలిస్తుండేవాడు. యుద్ధాల్లో ఎప్పుడు ఏ విజయం సాధించినా అది "భగవత్కృప" అంటూ ఆయన పూజించే ఇష్ట దైవపు విగ్రహానికి. ఏవో బంగారు ఆభరణాలు బహుమతులుగా అర్పిస్తుండేవాడు.

ఒకసారి హెరాన్ కొంత బంగారాన్ని ఒక బంగారపు పనివాడికిచ్చి, తన ఇష్టదైవానికి అర్పించేందుకు వీలుగా దానిని అందమైన కిరీటంగా తయారుచేయమన్నాడు. అయితే కిరీటం తయారయ్యాక ఎందుకో హెరాన్‌కు అది అసలైన బంగారంకాదని, అందులో రాగి బాగా కలిసిందని అనుమానమొచ్చింది. అందంగా వుండే కిరీటం చెడగొట్టకుండా అసలు బంగారంలో ఎంత రాగి కలిసిందో తెలుసుకోమని నగరంలో గణితశాస్త్రవేత్తగా, పరిశోధకుడిగా ప్రసిద్ధుడైన ఆర్కిమెడీస్‌కు చెప్పాడు, ఆర్కిమెడీస్ వెంటనే "సరే" నన్నాడు. అయితే, ఇరవైరెండొందల ఏళ్ళక్రితం, ఇప్పటిలా ఏ సాంకేతిక పరికరాలులేవు.

బంగారం-రాగి-ఏ పాళ్ళలో కలసివున్నాయో కిరీటం చెడ గొట్టకుండా తెలుసుకోవటం ఎలా? ఆ సమస్యే ఆలోచించి ఆలో చించి ఆయన తల బరువెక్కిపోయింది. ఆ అలసట పోవటానికి స్నానం చన్నీటితో చేయాలనుకున్నాడు.

అప్పటి కాలంలో తొట్టిలో పడుకుని అభ్యంగన స్నానం చేయటం ప్రముఖులందరికీ అలవాటే! అలవాటుగా స్నానం చేస్తుండగా ఆర్కిమెడీస్‌కు మెరపు మెరసినట్టు బుర్రలో ఓ చక్కటి ఆలోచన తట్టింది.

వెంటనే నీటితొట్టిలోనుంచి ఒక్క ఉదుటున లేచి బయటికి పరిగెత్తుకొస్తూ "యురేకా యురేకా" (కనుగొన్నాను-కనుగొన్నాను) అంటూ అరవసాగాడు. జనానికి అతను కనుగొన్నదేమిటో అర్థం కాలేదు.

జరిగిన విషయం ఇది.

ఆర్కిమెడీస్ నీళ్ళతొట్టెలో పడుకోగానే అతని శరీరపు బరువుకు, తొట్టెలోనినీరు తొట్టెనుంచి పొరలి పొంగి పారాయి. అలా పొర్లిపోయిన నీరు ఆయన శరీర బరువుకు సమానం!

ఇదే సూత్రంమీద ఆధారపడి-రాజుగారి కిరీటాన్ని నీరు నిండిన ఓ పాత్రలో వేసాడు. అప్పుడు పొర్లిపోయిన నీటిని ఓ పాత్రలోకి సేకరించాడు. దాన్ని లెక్కకట్టాడు.

కిరీటం చేయటానికి వాడినంత మంచి బంగారం-తూకం వేయించి తెప్పించి, పై విధంగానే నీరు నిండిన పాత్రలో వేశాడు. అప్పుడు పొర్లిపోయిన నీటిని తీసుకుని దానిని లెక్కకట్టాడు. రెండింటికీ తేడా ఉంది.

ఆ తేడా వున్నంత బరువును బంగారం రూపంలో, కిరీటం

చేసిన పనివాడు కాజేసి, దానిస్థానంలో రాగి కలిపి, రాజుగారిని మోసంచేశాడు.

ఆర్కిమెడీస్ అలా కనిపెట్టిన ఆ సూత్రమే ఇప్పటికీ "పదార్థాల తారతమ్య సాంద్రత–భౌతిక సిద్ధాంతంగా" ప్రపంచ ప్రసిద్ధమైంది.

తరువాత ఆర్కిమెడీస్ సముద్రపు వొడ్డున, ఓడలనుంచి, బరువుదింపే కొన్ని యంత్రాలు సృష్టించాడు. తక్కువ శక్తితో, ఎక్కువ బరువును ఎత్తటానికి, దింపటానికి వీలుగా కప్పీలు, కొక్కాలు ఇరుసులున్న పరికరాలు తయారు చేసుకున్నాడు.

ఎత్తుగా ఉండే ప్రాంతానికి, పల్లంగా ఉండే ప్రాంతంనుంచి నీరు తేలిగ్గాతోడే యంత్రాలు కనిపెట్టాడు. ఇవి రైతుల పాలిటి వర ప్రసాదాలుగా ఎంతో ఉపకరించాయి. ఇప్పటికీ ఆయన రూపొందించిన సిద్ధాంతం మీద నడిచే అలాటి యంత్రాలు మనరైతులు పొలాల్లో వాడుతున్నారు.

కొంతకాలం తరువాత శత్రువుల ఓడలను సముద్రంలోనే కాల్చివేయ శక్తిగల భూతద్దాలవంటి యంత్రాలను ఆర్కిమెడీస్ కనుగొన్నాడు. వాటి సాయంతో, సూర్యరశ్మితో, శత్రు ఓడలను సముద్రంలోనే కాల్చివేసి హెయిరాన్ రాజుకు సాయపడ్డాడు.

అయితే క్రీ. పూ. 212లో సిరకూస్ శత్రువుల హస్తగతమైంది. ఆర్కిమెడీస్‌కు ఇదివరకటి గుర్తింపు, గౌరవం, మన్నన, లేకుండా పోయాయి.

తన మనస్సుకు కలిగిన బాధను మరచిపోవటానికి ఆర్కిమెడీస్ ఇక తన గణితశాస్త్ర అధ్యయనంలో మునిగిపోయాడు. రాత్రింబవళ్ళు అతనికి అదే లోకమైపోయింది. ఆకలిదప్పులు మరిచాడు.

ఒకరోజు అతను, నేలమీద గుండ్రంగా రేఖాశాస్త్ర సంబంధమైన లెక్కలువేస్తూ, ఏవో వృత్తాలు గీస్తూ ఏకాగ్రతలో ఉన్నాడు.

అప్పుడే అక్కడికి ప్రవేశించిన ఒక రోమ్ సైనికుడు, ఖడ్గధారియై తనవైపుకు వస్తున్న సంగతి ఆర్కిమెడీస్‌కు పట్టలేదు!

తనను, తన ఖడ్గాన్ని చూసి అందరిలా భయపడతాడనుకున్న రోమన్ సైనికుడు, వృద్ధుడైన ఆర్కిమెడీస్ అసలు తనవైపు చూడకపోవటంతో ఆశ్చర్యంతోపాటు కోపమూ వచ్చింది.

తన రేఖాగణితానికి అడ్డం వచ్చిన వ్యక్తిని విసుగ్గాచూస్తూ "దయచేసి నేను గీచిన వృత్తాలను చెరపకండి!" అంటూ, అరిచాడు.

అసలే కోపంతోవున్న ఆ సైనికుడికి పట్టుమంది, తన చేతిలోని ఖడ్గంతో ఒక్క పోటుతో ఆర్కిమెడీస్‌ను సంహరించి, వెళ్ళిపోయాడు.

ఆ విధంగా ప్రపంచానికి తన పరిశోధనా విజయాలలో సేవలు చేసిన ఆర్కిమెడీస్ చివరికలా ఒక మూర్ఖసైనికుడి అజ్ఞానికి బలయ్యాడు.

# లియొనార్డో చిత్రించిన రెండు చిత్రాలు

'లియొనార్డో-డా-విన్సీ' పేరు చెప్పగానే, మనకు ప్రపంచ ప్రసిద్ధమైన "మొనాలిసా చిత్రం", క్రీస్తు చివరి భోజనం — "లాస్ట్ సప్పర్" చిత్రాలు స్మృతి పథంలో మెదలుతాయి.

అయితే ప్రపంచంలో ఇప్పుడతనిని ముఖ్యంగా మనం, ఒక చిత్రకారుడిగా గుర్తిస్తున్నాము. కాని, నిజానికతడు గణితవేత్త, శాస్త్రజ్ఞుడు, వేదాంతి, సంగీతకారుడు, శిల్పి, చిత్రకారుడు. అంతటి బహుముఖ ప్రజ్ఞాశాలి అప్పటి కాలంలో లేడన్నంత గొప్ప పేరు ప్రతిష్ఠలు గడించాడు, లియొనార్డో.

లియొనార్డో 1452లో ఇటలీదేశంలోని ఫ్లారెన్స్ నగరంలో పుట్టాడు. అతని సమకాలీనుడైన మైఖలేంజ్‌లో, రాఫెల్‌లాంటి ప్రముఖ చిత్రకారులు, శిల్పులు అతనితో సమాన ప్రతిభ కలవారే!

ఒకసారి లియొనార్డో తండ్రికి అతని మిత్రుడు ఒక పెద్ద చెక్క స్టైయిలాంటిది ఇచ్చి, దానిమీద అందంగా ఉండే బొమ్మలు ఏమైనా వేయించి పెట్టమన్నాడు. వెంటనే ఆయన అది లియొనార్డోకు ఇచ్చాడు విషయం చెప్పి, తరువాత పూర్తయిన ఆ బొమ్మల్నిచూసి లియొనార్డో తండ్రే విస్తుపోయాడు. జీవకళ ఉట్టిపడుతుండే విధంగా బొమ్మల్ని రంగుల్లో లియొనార్డో చిత్రించాడు. ఆ బొమ్మలను పూర్తి చేయటానికి నిజంగా కొన్ని ప్రాణులను నమూనాగా (మోడల్స్) అతను వాడుకున్నాడు. అప్పటి నుంచి లియొనార్డోను మంచి చిత్రకారుడిగా తయారు చేసేందుకు తండ్రి ప్రోత్సహించాడు.

క్రమేపీ లియోనార్డో మంచి పెయింటరుగా ప్రసిద్ధుడయ్యాడు. **1495-1497** మధ్యకాలంలో "క్రీస్తు చేసిన చివరి విందు" అనే చిత్రాన్ని చిత్రించటంతో అతను ప్రఖ్యాతి వహించాడు. ఆ చిత్రంలో క్రీస్తు తన పన్నెండు మంది శిష్యులతో కూర్చొని వున్న ఆ సజీవ దృశ్యాన్ని చూడటానికి దేశదేశాల ప్రజలు రాసాగారు. ఫ్రాన్సు చక్రవర్తి స్వయంగా ఆ చిత్రాన్ని దర్శించి, ఆనందించటమేకాకుండా ఆ చిత్రం తన ప్రార్థనా మందిరంలో వుండాలని పట్టుబట్టాడు.

లియోనార్డో — ఆ "లాస్ట్ సప్పర్" చిత్రంలో, క్రీస్తు పన్నెండుగురు శిష్యుల్ని చిత్రించేప్పుడు, చాలా జాగ్రత్తలు తీసుకున్నాడట! క్రీస్తు శిష్యుల్లో ఒకడైన జూడాస్ ఇస్‌కారియాట్ ముఖం చిత్రించటానికి కొంత కాలం లియోనార్డో వేచివున్నాడట. అతను రోజూ నేరస్తులు, జూదగాళ్ళు, మోసగాళ్ళు ఉండే ప్రాంతాలన్నీ తిరిగి తిరిగి జూడాస్ ఇస్‌కారియెట్ వంటి పయోముఖ విషకుంభాన్ని చిత్రించడానికి ఎంతో సమయం తీసుకుని, చివరకి ఒక మతాధికారినే మోడల్‌గా తీసుకుని తన చిత్రం పూర్తిచేశాడు.

చాలా ఏళ్ళు అనేక ప్రాంతాలు తిరిగి తిరిగి చిత్రకళా నైపుణ్యాన్ని ప్రదర్శించిన లియోనార్డో, **1500** ప్రాంతంలో తిరిగి ఫ్లారెన్స్‌కు వచ్చాడు. అప్పటికే అతనికెంతో పేరు ప్రఖ్యాతులు వచ్చినాయి.

**1503-1506** మధ్య కాలంలో లియోనార్డో ఫ్రాన్‌సెస్కో అనే ఒక జమీందారు భార్యను మోడల్‌గా చేసుకుని ఆమె చిత్రాన్ని నభూతో నభవిష్యతి అన్న విధంగా తీర్చిదిద్దాడు.

ఈ పెయింటింగ్ చేస్తున్నప్పుడు అతని వయసు **51** ఏళ్లు। అతను మోడల్‌గా చేసుకున్న జమీందారిణి వయసు **24** ఏళ్ల

ప్రతిరోజూ సాయంత్రం, అప్సరసలాంటి ఆ జమీందారిణి, లియోనార్డో స్టూడియోకు వస్తుండేది. ఆమె ముఖంలో చిరునవ్వు, కళ్ళలో చిలిపితనం, ఒక విధమైన సంతృప్తి, రాజఠీవి ఆమెలో కనిపించేట్టుగా లియోనార్డో చిత్రించాడు. ఆమె ముఖంలో ఆనందం కనిపించాలని, ఆమె పెదవులపై అదరహాసం మాయం కాకూడదని, లియోనార్డో ఆమెకోసం విదూషకులను, సంగీతకారులను, తను చిత్రం గీచినంత సేపు సిద్ధంగా ఉంచుకునేవాడట.

అంత అందంగా తయారైన ఆ చిత్రాన్ని చివరికి లియోనార్డో తనే అట్టిపెట్టుకున్నాడు. కారణం, ఆ యువతిని, ఆమె చిత్తరువును లియోనార్డో ప్రేమించటమే ఇందుకు కారణం. ఆ చిత్తరువు కోసం ఆ యువతి భర్త ఎప్పుడు అడిగినా "ఇంకా ఆ బొమ్మ పూర్తి కాలేదు" అనేవాడట, లియోనార్డో.

లియోనార్డో 1516లో ఫ్రాన్సురాజుగారి ఆహ్వానంమీద, ఇటలీ నుంచి ఫ్రాన్సుకు వెళ్ళినప్పుడు, ఫ్రాన్సు రాజే స్వయంగా నాలుగు వేల బంగారు నాణాలు ఇచ్చాడు. ఆ మోనాలిసా బొమ్మ కోసం! అయితే 1519లో లియోనార్డో చనిపోయాక మాత్రమే అది రకరకాల రాజుల చేతులు మారి, చివరికి ప్యారిస్ ఆర్ట్ మ్యూజియమ్ చేరుకుంది. అక్కడా అది 1911లో దొంగిలించబడి రెండేళ్ళ తరువాత ఇటలీలో దొరికింది. తరువాత కూడా అది 26 రోజులపాటు ఫ్రాన్సులో మాయమై తిరిగి ఎలాగో దొరికింది. ఇప్పటికీ అది ప్రపంచ ప్రసిద్ధమైన కోట్లు విలువ చేసే గొప్ప కళాఖండం.

# కథల తాతయ్య టాల్‌స్టాయ్‌ను మార్చివేసిన సంఘటన



టాల్‌స్టాయ్
**(1828–1910)**

ప్రపంచ సాహిత్యంలో "లియో టాల్‌స్టాయ్‌ది" అత్యంత ఉన్నత స్థానము. తను పుట్టుకతో పెద్ద జమీందారు. అయితే క్రమేపీ ఆయనలో సామ్యవాద భావాలు రావటమేకాక, ఆయన తన ఆస్తి పాస్తులన్నింటినీ త్యజించి, ఒక మహర్షిలా ఆశ్రమంలో ఆదర్శ జీవితం గడిపాడు. అయితే టాల్‌స్టాయిలో, ఆయన రచనలో జీవిత పథంలో జరిగిన ఒక ముఖ్య సంఘటన ఈ మార్పుకు కారణం అని కొందరికే తెలుసు! ఆ సంఘటన ఇలా జరిగింది.

అప్పటికే టాల్‌స్టాయ్‌కు "కథలు తాతయ్య" అని పేరుండేది. ఆయన కథల్లో, ఎక్కువగా రైతులు, రైతుల సమస్యలు, వాళ్ళ సాధక బాధలు చిత్రించడం టాల్‌స్టాయ్ ఎక్కువ చేస్తుండేవాడు! ఇందువల్ల ఆయన అభిమానుల్లో ఎక్కువమంది పేదరైతులు వుండేవారు.

ఒకసారి టాల్‌స్టాయ్ తనభవంతినుండి కాలినడకన వ్యాహ్యాళికి బయలుదేరాడు. ఆయన అలా చాలా దూరం వెళ్ళి వస్తుండగా ఇద్దరు పేదరైతులు ఆయనకు కనిపించారు. వారిద్దరు శతవృద్ధులు_ నిరాడంబరులు. వాళ్ళు తమ చేతికర్రలు టక్కుటక్కుమని నేలకు తాటిస్తూ టాల్‌స్టాయ్ ఇంటివైపు వచ్చారు. వాళ్ళు టాల్‌స్టాయ్‌ను చూడగానే ఆయననూ సామాన్యరైతుగానే అనుకొని "బాబూ! ఇక్కడెక్కడో కథల తాతయ్య అని ఒకాయన వుండాలట! ఆయనను

"ఈసోపో" అంటారు! ఆయన కథలు-వాడవాడలా పల్లెపల్లెలా, ఆబాల గోపాలం చెప్పుకుంటారు! నీకు ఆయన యిల్లు తెలుసునా?" అంటూ అడిగారు.

అయితే టాల్‌స్టాయ్‌కు, తనే "టాల్‌స్టాయ్"నని చెప్పుకో కుండా, వాళ్ళు తనను గురించి యింకేమి చెబుతారో విని తెలుసు కుందామని, కుతూహలం కలిగింది.

అందుకని టాల్‌స్టాయ్ "ఔనౌను! నేనూ కథల తాతయ్యను గురించే విన్నాను! ఆయన యిల్లు యిక్కడికి దగ్గరలోనే అరణ్య ప్రాంతంలో ఉంది! మీరు చాలా దూరంనుంచి వచ్చుచున్నట్లున్నారు?" అన్నాడు.

"ఔను బాబూ! మేము 'క్రసిన్‌స్కీ' ప్రాంతపు గ్రామవాసులము! మా పొలాల నూర్పిళ్ళు అయ్యాక మా కథల తాతయ్యను చూచి రావాలని నిర్ణయించుకున్నాము! మాకు కొన్ని జానపద కథలు తెలుసు! అవి కథల తాతయ్యకు చెప్పి ఆయనచేత వ్రాయించాలని మా ఆశయం!" అంటూ ఆ వృద్ధులలో ఒకడు తనకొచ్చిన ఒక జానపద కథ చెప్పటం ప్రారంభించాడు.

అటువంటి జానపదగాథ, టాల్‌స్టాయ్ ఎప్పుడూ విని వుండ లేదు! ఆ పదగుంభన, వాస్తవికత పాత్రచిత్రణ, వాతావరణము, అపూర్వముగా ఉంది. టాల్‌స్టాయ్‌ను ఎంతో ప్రభావితం చేశాయి. గొప్పగా ఉన్నాయి. ఆ కథలు.

టాల్‌స్టాయ్‌కు ఇక వాళ్ళ కథలు అన్నీవిని, మంచి మంచి జానపద గాథలు వ్రాయాలని నిర్ణయించుకొని "రండి! మిమ్మల్ని ఆ కథల తాతయ్య ఇంటికి తీసుకెళతాను!" అంటూ, టాల్‌స్టాయ్ వారిని తన యింటికి తీసుకెతున్నాడు.

ఇంతలో టాల్‌స్టాయ్ పిల్లలు, వారింటికి అతిధిగా వచ్చిన వారి పిల్లలు ఒక పెద్ద గుఱ్ఱపు బగ్గీలో వ్యాహ్యాళికి వెళ్ళి తిరిగి వస్తు న్నారు.

ఇంతలో టాల్‌స్టాయ్‌ను ఆ ఇద్దరు వృద్ధులలో ఒకడు బాగా పరికించి చూస్తుండగా "నేనే! ఆ కథల తాతయ్యను! నన్ను గుర్తుపట్టలేదా!" అన్నాడు టాల్‌స్టాయ్, నవ్వుతూ.

టాల్‌స్టాయ్‌ను ఆశ్చర్యంగా చూస్తూ "అయితే నీవు వ్రాసిన 'ఇద్దరు వృద్ధుల కథ'—మమ్మల్ని గురించేనా! ఆ కథ మా మనవడు మాకు చదివి వినిపించాడు! అయితే కథల తాతయ్య నువ్వే నన్నమాట! తాతా...మరి నీదగ్గర చాలా కథలపుస్తకాలు వుండి వుండాలే! లేకపోతే ఇన్ని కథలు ఎలా వ్రాయగలవు?" అన్నారు ఇద్దరూ.

"ఔను! నా దగ్గర చాలా పుస్తకాలున్నాయ్! రండి ఈ పూట మీరిద్దరూ నా అతిథులు!" అంటూ టాల్‌స్టాయ్ వాళ్ళను తన జమీందారీ భవంతిలోకి ఆహ్వానించాడు.

కాని ఆ వృద్ధు లిద్దరికీ టాల్‌స్టాయ్ ఇంటిముందున్న కొలను, పచ్చికంగులో వున్న జమీందారీ భవంతి, సువిశాలమైన పచ్చిక మైదానము ఆశ్చర్యాన్ని కలిగించి "ఇవన్నీ...ఇవన్నీ...నీకు చెందినవేనా కథల తాతయ్యా!" అన్నారు.

ఇంతలో ఖరీదైన జమీందారుల దుస్తుల్లో వచ్చినటాల్‌స్టాయ్ పిల్లల్ని చూసి "ఈ పిల్లలు మీ పిల్లలేనా?" అన్నారు, మరింత ఆశ్చర్యంగా.

"ఔను!" అన్నాడు టాల్‌స్టాయ్.

అయితే ఇక సెలవు! వస్తాము! నీ ఆతిథ్యం మేం స్వీకరించలేము! నీ కథలనుబట్టి మేము వూహించిన నిరాడంబరమూర్తి నీలో మాకు కనిపించలేదు! మాకు-మా వంటి కార్మికులకు, రైతులకు కావలిసిన కథలు నువ్వు చెప్పలేవు! అంటూ వెళ్ళిపోయారు.

ఆ సంఘటన టాల్‌స్టాయ్ జీవిత దృక్పథాన్నే మార్చి వేసింది. ఆయనలో ఎంతో పరివర్తన తెచ్చింది.

# ఇవాన్ (ది టెరిబుల్)

ప్రపంచ చరిత్రలో 1583వ సంవత్సరానికి ఒక ప్రత్యేకత వుంది. ఆ సంవత్సరమే రష్యా పాలకుడు (అప్పట్లో రష్యాపేరు మాస్కోవీ) తన యాభై ఒకటోయేట చనిపోగా, రష్యా పాలకుడుగా మూడేళ్ళ యువరాజు సింహాసనం ఎక్కవలసివచ్చింది. అప్పట్లో 'బోయర్స్' అనే రాజవంశీయులు చిన్నచిన్న సామంతులుగా వుండి తమ పలుకుబడితో తమ యిష్టం వచ్చిన తీరులో సంచరిస్తూ తామే స్వతంత్ర పాలకులుగా చలామణీ అవుతుండేవారు. ఈ పరిస్థితిలో మూడేళ్ళ యువరాజు పాలన వాళ్ళకునవ్వులాటగా తోచింది. అయితే మహారాణి 'హెలెన్ గ్లెన్‌స్కీ' మాత్రం ఆ ఏకైక వారసుడిని కంటికి రెప్పలా కాపాడుతూ, అతడిని సంరక్షించింది.



మొదటి జార్ చక్రవర్తి
(1530–1584)

బోయర్ రాజవంశీయులు వారిని చంపేందుకు అతి రహస్యంగా కుట్రలను పన్నుతుండేవారు. అయిదేళ్ళు కష్టపడి చివరకి మహారాణికి వంటలుచేసే నౌకర్లకు పెద్దమొత్తాలు లంచాలిచ్చి మహారాణి, యువరాజు తినే ఆహారాల్లో విషం కల్పించారు.

మహారాణి మాత్రం ఇలాంటి ప్రమాదం జరుగుతుందనే భయం మొదటి నుండీ ఉండడంచేత ఎంతో అప్రమత్తతతో ఉండేది. ఆమె తన కుమారుడికి ధైర్యసాహసాలు కలిగించే అన్ని ఆటపాటలు నేర్పడమే కాకుండా రాజనీతిని బోధిస్తూ శత్రువ్యూహాలను ఎలా ఛేధించాలో, ప్రాణాపాయ పరిస్థితి నుంచి ఎలా తప్పుకోవాలో కూడా యువ రాజుకు అంత చిన్న వయస్సు నుండే నేర్పించింది.

నౌకర్లు ఎంత నమ్మకస్తులైనా ముందు జాగ్రత్త కోసం వాళ్లు తయారు చేసిన ఆహారాన్ని తను ముందు తినేది. తరువాత ఓ గంటకు గాని తన కుమారుడికి ఆ ఆహారం పెట్టేదికాదు. ఆహారంలో ఏదన్నా విషంలాంటిది కలిస్తే ఆ ప్రమాదం తనతో నమసిపోవాలి. యువరాజు సురక్షితంగా ఉండాలని ఆ తల్లి ఉద్దేశం. ఈ పని చాలా రహస్యంగా ఆమె చేస్తుండడంచేత అది వంటవాళ్ళకు సయితం తెలిసేదికాదు.

ఒకరోజున ఆమె తను తిన్న ఆహారంలో విషం కలిసినట్లు గ్రహించింది.

ఆమె ధైర్యంగా, ఎంతో నిబ్బరంగా యువరాజుని దగ్గరకు పిలిచి జరిగింది వివరించి "బాబూ ! ఇక నుండి నువ్వు తినే ఆహారం నీ పెంపుడు కుక్కకు పెట్టి అది దోషరహితమని తెలిసిన తరువాతే దానిని భుజించు, జాగ్రత్త. ఇలా నీ ఆహారాన్ని నువ్వు పరీక్షిస్తున్న సంగతి ఎవరికీ తెలియకూడదు. అలా తెలిస్తే నీ శత్రువులు మరో కొత్తమార్గం తొక్కుతారు ! శత్రుశేషం, ఋణశేషం, తగవని పెద్దలు చెబుతారు. బోయర్ రాజవంశీయుల వల్లనే నీకు ప్రమాదం. అందులో 'ఘూయిన్‌కి' అనేవాడే నిన్నూ-నన్నూ చంపాలనే ఈ విష ఆహారం నీకూ నాకూ పెట్టించాడు" అంటూ కన్నుమూసింది.

తల్లి తన ప్రాణరక్షణకు తీసుకున్న జాగ్రత్తకు యువ

రాజు ఆశ్చర్యపోయాడు. చనిపోయిన తల్లిమీద ప్రమాణం చేస్తూ "అమ్మా! బోయర్స్ రాజవంశీయులకు తగినశాస్తి చేసి నీ ఆత్మకు శాంతి చేకూరుస్తాను!" అంటూ విలపించాడు.

మరో అయిదేళ్ళపాటు యువరాజు బోయర్స్ ఆటలను సహించాడు. పదమూడేళ్ళ వయసు రాకమునుపే తనకు విశ్వాస పాత్రులైన ఓ మంచి మిత్రబృందాన్ని ఏర్పాటు చేసుకున్నాడు. పదిహేడేళ్ళ వయసు రాగానే "బోయర్స్" వంశీయుల నందరినీ తన ఆస్థానానికి వచ్చి కనబడమని రాజాజ్ఞ జారీచేశాడు.

అయితే బోయర్సు ఆ రాజాజ్ఞను పాటించక ఆ వర్తమానం తీసుకెళ్ళిన వార్తాహరుడిని సంహరించారు. తరవాత కొద్ది సైన్యంతో యువరాజు ఆస్థానానికి వచ్చాడు. అప్పుడు వాళ్ళ ఊహించినదానికి భిన్నంగా యువరాజు వాళ్ళను బంధింపజేశాడు. ఈ హఠాత్ పరిణామానికి అచ్చెరువందిన 'ఘూయిస్కీ' తప్పించుకునే ప్రయత్నంలో వుండగా, యువరాజు పెంచిన వేటకుక్కలు అతడిమీద పడి, అతడిని, అతడు ఎక్కిన గుర్రాన్ని చీల్చి చెండాడాయి. అంతభయంకర శిక్ష కళ్ళారా చూశాక మిగిలిన బోయర్సు లొంగిపోయారు. తరువాత ఆ పదిహేడేళ్ళ యువరాజు మొదటి "జార్" చక్రవర్తిగా రష్యాను 1584 వరకు పరిపాలించి చరిత్ర ప్రసిద్ధుడయ్యాడు.

## తను నమ్మిన నిజం కోసం జైలుకెళ్ళిన గెలీలియో

అది 1633వ సంవత్సరం.

రోమ్‌లోని ఒక మతాధిపతులమఠంలో, డెబ్బయి ఏళ్ళ వయసు మించిన ఒక వృద్ధుడిమీద గొప్ప అభియోగం వచ్చింది.



గలీలి గెలీలియో
1564–1642

అప్పటి వరకు బైబిల్‌లో చెప్పబడిన అనేక విషయాలకు, అతను భిన్నంగా కొన్ని వాస్తవ నిరూపణలు, శాస్త్ర యుక్తంగా చేశాడు.

అప్పటికాలంలో, మతవిశ్వాసాలను వ్యతిరేకించే ఏ చర్యనైనా విచారించి శిక్షించే హక్కు మతాధికారులకుండేది.

కొత్తగా ఆ శాస్త్రజ్ఞుడు, భూమి సూర్యునిచుట్టూ తిరుగుతున్నదని నిరూపించాడు. కాని, అంత వరకు సూర్యుడే భూమి చుట్టూ తిరుగుతున్నాడని అందరూ నమ్ముతూ వచ్చారు. అప్పటి వరకు అందరూ నమ్ముతూ వచ్చిన దానికి భిన్నంగా, "కోపర్నికస్ అనే ప్రముఖ శాస్త్రవేత్త చెప్పిన "సూర్యుడి చుట్టూ భూమి తిరుగుతోంది" అనే సిద్ధాంతాన్ని గెలీలియో బలపరచటం మాత్రమేకాక, తను కని పెట్టినశక్తివంతమైన టెలిస్కోపుతో నిరూపించాడు.

ఈకొత్త సిద్ధాంతాల ప్రచారాన్ని ఆపమని అతనిని అప్పటి మతాధికారులు శాసించారు. గెలీలియో కొన్నాళ్ళు ఊరుకున్నాడు.

కాని తరువాత తిరిగి తన సిద్ధాంతాలను "డయలాగ్స్" పేరుతోవున్న గ్రంథంలో ప్రచురించాడు.

అంతే ! !

మతాధిపతులంతా అతని మీద విరుచుకుపడ్డారు. వెంటనే అతనిని తమముందు హాజరు కమ్మని చేసిన తప్పుకు ముందు క్షమాపణ చెప్పి, తరువాత తన సిద్ధాంతం తప్పంటూ ఒప్పుకోమన్నారు. ఆ విధంగా లిఖితపూర్వంగా వ్రాసియివ్వమన్నారు.

గెలిలియోకు తెలుసు. తను వాళ్ళ మాటను కాదంటే, తనను వాళ్ళు శాశ్వతంగా జైల్లోవేస్తారు. ఆ వృద్ధాప్యంలో వాళ్ళకు ఎదురు తిరిగి తను చేయగలిగింది ఏమీలేదు. కాని ఆయన అంతరాత్మ ఆయనకు ఎదురు తిరుగుతున్న సత్యాన్ని కాదని, తను అబద్ధాన్ని బలపరిస్తే, తను శాస్త్రజ్ఞుడనన్న పేరుకు తగడు.

"ఏమంటావు ! ? ఏదిదేనిచుట్టూ తిరుగుతోంది ?" గద్దించి అడిగారు మతాధిపతి, రౌద్రాకారంతో అరుస్తూ.

అప్పుడైనా భయపడి "భూమిచుట్టూ సూర్యుడు తిరుగుతున్నాడు" అంటూ చెబుతాడని.

కాని గెలిలియో మాత్రం "భూమే సూర్యునిచుట్టూ తిరుగుతోంది !" అన్నాడు, మొండిగా.

అంతే గెలిలియో జైలుకు పంపబడ్డాడు.

అలా తను నమ్మి నిరూపించిన సిద్ధాంతం కోసం పోరాడిన గెలిలియో, ఇటలీలోని, పీసా నగరంలో 1564 లో పుట్టాడు. విద్యార్థి దశనుండే ఆయన అనేక యంత్రపరికరాలతో, కొత్తకొత్త యంత్రాలు సృష్టించటంలో కృషి సాగించాడు. ఆయన తండ్రి వ్యాపారి. అయినా ఆయన గెలిలియోకు మంచి విద్యాబుద్ధులు చెప్పించి విశ్వవిద్యాలయంలో కూడా చదివించాడు. అతను వైద్య విద్యార్థి.

ఒకరోజు గెలిలియో చర్చిలో ప్రార్థనకు వెళ్ళాడు. చీకటి పడబోతుండటంతో, చర్చికప్పుకు వ్రేలాడే గొలుసుకు ఒక కొవ్వొత్తి వెలిగించబడింది. గాలికి అటుఇటు ఆ గొలుసు కదులుతూవుంటే, గెలిలియో తన చేతి నాడి సాయంతో, ఆ గొలుసుకున్న దీపం ఇటు నుంచి అటు కదలటానికి తీసుకుంటున్న సమయాన్ని లెక్క కట్టాడు. ఊపు ఎక్కువగా వున్నప్పుడూ, ఊపు తగ్గినప్పుడుకూడా, పట్టినకాలం సమానమని తెలుసుకున్నాడు. దీన్ని ఆధారంగా చేసుకుని, ఆ రోజునే "పల్స్‌మీటర్" అనే ఒక యంత్రాన్ని గెలిలియో సృష్టించాడు. అది వైద్యులకు ఎంతోసాయపడింది. దీనిఆధారంగానే తరువాత, గెలిలియో కుమారుడు విన్‌సెన్‌జీ గోడగడియారాన్ని కనిపెట్టాడు. అప్పటి వరకుగోడగడియారాలు జనం ఎలావుంటాయో కూడా ఊహించి ఎరుగరు. ఆ విధంగా గోడగడియారంలోని పెండ్యులమ్ ఆవిర్భావానికి. అతను ఆద్యుడయ్యాడు తరువాత ఎన్నిరకాల గడియారాలొచ్చాయో మనకు తెలుసు.



ఇరవై మూడేళ్ళ వయసులో గెలిలియో పీసా యూనివర్సిటీలో గణితాచార్యుడుగా వున్నాడు. ఒక రోజు ఆయనకు ఒక మత గ్రంథంలో, బరువైన వస్తువులు, తేలికైన వస్తువులు పైనుంచి ఒకేసారి నేలమీదకు వదలినపుడు, బరువైన వస్తువులు ముందుగా నేలకు చేరుకుంటాయ్-అని కనిపించింది. ఈ సిద్ధాంత ప్రతిపాదన చేసింది,ప్రముఖ తాత్వికవేత్త, మేధావి, శాస్త్రజ్ఞుడు అరిస్టాటిల్. గెలిలియో దీన్ని తప్పని నిరూపించాడు.



ఇది నిరూపించడానికి నూటఎనభై అడుగుల పీసా గోపురాన్ని అతను ఎన్నుకున్నాడు. తను పైసా గోపురపు ఎనిమిదో అంతస్తుకెక్కి, అక్కడి నుంచి వందపౌనులు, 25 పౌనుల బరువున్న రెండు బంతులను పైనుంచి వదిలాడు. ఆ వింత ప్రయోగాన్ని

చూడటానికి వచ్చిన శాస్త్రవేత్తలు, మతాధికారులు, అరిస్టాటిల్ చెప్పినదే తప్పని, గెలిలియో ప్రయోగమే నిజమని ఒప్పుకోక తప్ప లేదు. ఈ ప్రయోగంతో గెలిలియో, అజ్ఞానులైన శాస్త్రవేత్తలను అపహాస్యం చేశాడు. ఫలితంగా అతని గణితాచార్యుడి ఉద్యోగం ఊడింది.

ఒకసారి గెలిలియో, వెనిస్‌నగర పర్యటనకు వెళ్ళినప్పుడు, లిప్పర్‌స్కే అనే అతను కనిపెట్టిన 'స్పయిగ్లాస్' (గూఢచారులు వాడే అద్దం) అనేదాన్ని గురించి వినివున్నాడు. గెలిలియోకూడా రెండు కళ్ళజోళ్ళ అద్దాలతో, ఒక సీసం గొట్టాన్ని కలిపి ఒకచిన్న టెలిస్కోపు నిర్మించాడు. దాని సాయంతో, వస్తువులు ఎనిమిది రెట్లు పెద్దవిగ కనిపించే స్థితివచ్చింది. తరువాత ఇంకో టెలిస్కోపు తయారుచేశాడు. దాని సాయంతో వస్తువులు ముప్పయిరెట్లు చేశాడు. దానిద్వారా చంద్రుడిని, నక్షత్రాలను చూశాడు. తరువాత గురు గ్రహాన్ని (జూపిటర్) దానిచుట్టూ నాలుగు చిన్న నక్షత్రాలు వున్నట్టు కనిపెట్టాడు. సూర్యుడిమీద పరిశోధనలు చేసి అందులో ఏవో పెద్దమచ్చలున్నట్టు వెల్లడించాడు. ఎక్కడో సముద్రంలో కొన్ని మైళ్ళ దూరంలో వున్న ఓడలు సైతం చూడటానికి రాజులు ఆ టెలి స్కోపును వాడేవాళ్ళు. సముద్రాల్లో ప్రయాణం చేసేవాళ్ళు, ఈ టెలి స్కోప్‌లు వాడేవాళ్ళు. సముద్రపుదొంగల ఓడలను గుర్తించి వాటి బారినుండి తప్పుకోడానికి ఈ టెలిస్కోప్ వాళ్ళకు ఎంతో సాయ పడేది.

అలా తన మేధాసంపత్తితో మానవాళికి సేవలు చేసిన శాస్త్రవేత్త గెలిలియో, తన చివరిదశలో, ఖైదులో జీవితం గడపవలసి వచ్చింది.

# ఔరంగజేబు వ్రాసిన వింత ఉత్తరం

మొగలాయి చక్రవర్తులలో ఔరంగజేబు పేరు చెప్పగానే, మనకు సహజంగా—ఒక పరమత ద్వేషి, సోదర హంతకుడు, తండ్రిని ఖైదుచేసిన కఠినాత్ముడు స్ఫురిస్తాడు. కాని, పాలకుడుగా ఆయన సర్వ సమర్థుడు, నిరాడంబరుడు, నిస్వార్థ పరుడు, నిజాయితీ పరుడు, అన్నింటినీ మించి మంచి పరిపాలనాదక్షుడు. ఆదర్శచక్రవర్తిగా ఎంతో మంచి పేరు ప్రతిష్ఠలు పొందిన



ఔరంగజేబు (1618–1707)

ఔరంగజేబు, తన బాల్యములో అత్యంత విలువైన పదేళ్ళకాలము, నిరుపయోగమైన విద్యాభ్యాసములో వృథా అయినట్లు అర్థం చేసుకున్నాడు. అయితే అప్పటికే జరగవలసిన అనర్థం జరిగిపోయింది. తను బాల్యంలో నేర్చిన భాష 'అరబ్బీ' నిత్యజీవితంలో ఎందుకూ పనికిరాక, కేవలం అలంకార ప్రాయమై మిగిలినట్టు ఆయన తెలుసుకున్నాడు.

తన జీవితంలో ఎంతో విలువైన పదేళ్ళకాలాన్ని తనకు భవిష్యత్తులో, ఎందుకూ పనికిరాని భాషను నేర్పిన ఆ గురువుగారి మీద ఆయనకు, ఎప్పుడూ కడుపు మంటగా ఉండేది. జీవితానుభవం గడిస్తున్నకొద్దీ, తను బాల్యంలో నేర్చుకున్న అరబ్బీ విద్యలో

తనకు చెప్పిన విషయాలు, నేర్పిన విజ్ఞానం చాలా పరిమితమని, పైగా అందులో చెప్పబడ్డ విషయాలు కాలదోషం పట్టినవని, ఆయా ప్రాచీన గ్రంథకర్తలు, అప్పటి తమ మిడిమిడి జ్ఞానాన్ని గ్రంథస్తం చేశారని తెలుసుకున్నాడు. తన జీవితంలోని ఆ పదేళ్ళ—పారశీకం, లేక—(మాతృభాషఅయిన) ఏ ఉర్దూలోనో బోధించివుంటే అదెంతోమేలు చేసివుండేదని అర్థంచేసుకున్నాడు.

ఇలా ఉండగా, ఒకరోజు, ముల్లాసావెహ్ అనే ప్రముఖ అరబ్బీ పండితుడు ఔరంగజేబుకు ఒక అర్జీపెట్టుకున్నాడు. ఈ అరబ్బీ పండితుడు మరెవరోకాదు. ఔరంగజేబుకు బాల్యంలో పది పన్నెండేళ్ళ అరబ్బీ భాషలో, వివిధ విషయాలు బోధించిన పండితుడు.

తన శిష్యుడు చక్రవర్తి అవటంచేత, పైగా అతను పదేళ్ళ పాటు తనవద్ద ప్రాథమిక స్థాయినుండి విద్య నభ్యసించి వుండటంవల్ల, తన పూర్వ గురువునన్న గౌరవాన్ని అతను తప్పకమన్నించి తనకు విద్యాశాఖలో పెద్దపదవి ఇచ్చి గౌరవిస్తాడని ముల్లాసావెహ్ తలపోశాడు. అందుకనే తనకు త్వరలో ఉద్యోగ నియామకం జరిగిందన్న శుభవార్త వస్తుందేమోనని ఎదురు చూడసాగాడు.

అయితే అతను ఆశించినట్టే ఔరంగజేబు చక్రవర్తినుంచి ఆయనకు, ఓ లేఖ అందింది! అది చదివి అతను హతాశయుడ య్యాడు. ఆలేఖలో ఇలా వుంది.

"గురువర్యా!

నిరుపయోగమైన అరబ్బీ భాషను పదేళ్ళు నేర్పి, కోమల మైన నాబుద్ధిని, చురుకైన నాగ్రహణశక్తిని మీరు వృధాచేశారు. మాతృభాషకాని ఒక భాషలో, పది పన్నెండేళ్ళు వెచ్చించి, నన్ను వ్యాకరణ పండితుణ్ణీ, ధర్మశాస్త్రజ్ఞుణ్ణీ చేశారు. దీనివలన లాభ మేమిటి? రాజ్యపాలన చేయవలసిన రాజకుమారుడికి లోకజ్ఞానం

# సాంఘిక దుస్థితులపై రాజా రామమోహన్‌రాయ్ సాగించిన పోరాటం



రాజారామమోహనరాయ్
(1772-1833)

భారతదేశంలో, అన్ని రంగాలలో పునరుజ్జీవన ప్రభావం కలిగించిన వాళ్ళు చాలా తక్కువమందే వున్నారు. అందులో రాజారామమోహన్ రాయ్‌కు మాత్రం అగ్రస్థానం ఇవ్వాలి.

రామమోహన్‌రాయ్ వంగదేశంలో రాధానగరంలో 1772లో ఒక సంపన్న బ్రాహ్మణకుటుంబంలో జన్మించాడు. తల్లి తారిణీదేవి ప్రభావం ఆధ్యాత్మికంగా ఆయన మీద ఎంతో పడింది. తండ్రి రమాకాంత్‌రాయ్ పాండిత్య ప్రకర్ష ఆయనను బహు భాషా పండితుణ్ణి చేసింది. బెంగాలీ, సంస్కృతం పారశీక, అరబ్బీ భాషలు చిన్న వయసులోనే రామమోహనుడు కరతలామలకం చేసుకున్నాడు.

అరబ్బీ, పారశీక, వేదాంత గ్రంథాలు, బౌద్ధగ్రంథాలు, బాగా అధ్యయనం చేయటంతో, హిందువులు చేసే విగ్రహారాధనలోని లోపాలు తెలిశాయి. దీనికి తగ్గట్టు ప్రగతిశీల, హేతుబద్ధ రచనల ప్రభావంలోనున్న రామమోహనుడు, హిందూమతం పేరిట సాగుతున్న మూఢ, అంధ విశ్వాసాలను, కాలంచెల్లిన ఛాందసాలను, ప్రశ్నించటం ప్రారంభించాడు. తల్లి చేస్తున్న విగ్రహారాధన ఆయనకు నచ్చలేదు. అంతకుముందే బాల్యంలో రామమోహనుడికి వివాహమైంది ఆ అమ్మాయి చనిపోయింది. రామమోహనుడికి ఇష్టంలేక ఎంత వ్యతిరేకించినా, మళ్ళీ వివాహం చేశారు పెద్దలు! అప్పటికి రామమోహనుడికి పదిహేనేళ్ళు నిండలేదు.

ఇంతలో విగ్రహారాధనను, హిందూ మూఢాచారాల్ని విమ

రిస్తూ ఘాటైన ఓ వ్యాసాన్ని ప్రచురించాడు రామమోహనుడు. అది వంగదేశంలో పెద్ద పెనుతుఫాను రేపింది. తండ్రి సంప్రదాయంతో రామమోహనుడు తగవుపడే వింత పరిస్థితి వచ్చింది. ఆ తగవు ఇక రామమోహనుడు ఇల్లు విడిచి దేశదిమ్మరి అయ్యేవరకూ వెళ్లింది. అయినా రామమోహనుడు ఆ అవకాశాన్ని హిమాలయ పర్యటనకు బయలుదేరాడు. అక్కడ ఆయన టిబెట్టులో సంచరిస్తూ, అక్కడి సనాతన పూజా విధానాలను గమనించాడు! ఛాందసంగా లామాలు పాటించే మూఢనమ్మకాలు ఆయన వ్యతిరేకించాడు. అక్కడా ఆయన ఉండలేక తిరిగి సత్యాన్వేషణచేస్తూ, అనేకమంది యాత్రికుల్ని, సాధువులను, భక్తులను కలుసుకున్నాడు. దేవుడొక్కడే, ఆయన్నే పూజించాలి, ఆయన్నే అన్వేషించాలి. అనే భావన ఆయనలో బల పడింది. అప్పుడే ఢిల్లీపాదుషా వారి కొలువులో పదేళ్ళపాటు పని చేశాడు. అక్కడే ఆయనకు "రాజా" అనే బిరుదం ఇవ్వబడింది. ఆ కొలువులో ఉన్నప్పుడే "తుహిఫత్-ఉల్-మువా హిద్దీన్" అనే ప్రముఖ గ్రంథం వ్రాశాడు. "పరిశుద్ధ అస్తికుల కొక బహుమానం" అనే ఆ గ్రంథంలో, విగ్రహారాధనను, ఆయన అత్యంత నిశితంగా చీల్చి చెండాడాడు. ఈ గ్రంథం ఛాందస పండితుల్ని, సనాతనవిగ్రహా రాధకులను నోరెత్తకుండా చేసింది. 1803లో తండ్రి పరమపదించ టంతో, ఆర్థిక ఇబ్బందులకు లోనయిన రామమోహనుడు, జాన్‌డిగ్బీ అనే ఆంగ్లదొరగారి కొలువులో చేరాడు. అక్కడ ఆయనకు, ఆంగ్ల భాషతోపాటు, ఆంగ్లేయుల ఆచార వ్యవహారాలు అత్యంత నిశితంగా అధ్యయనం చేసే అవకాశం కలిగింది.

ఇంతలో 1811లో, రామమోహన్ని జీవితాంతం పట్టికుదిపి వేసిన ఘోర సంఘటన జరిగింది రామమోహనుడి సోదరుడు జగ న్మోహనుడు, ఆయన అకస్మాత్‌గా చనిపోవటంతో, చిన్న వయ సులో ఉన్న ఆయన భార్యను సతిసహగమనానికి ఏర్పాటు చేశారు బంధువులు. భర్తతో సహగమనం చేయవద్దని, అది ఆత్మహత్యా సదృశమని, వదినకు, సహగమనం—సాంఘిక దురాచారమని, ఘోర మైన పాపమని, ఎంతోచెప్పి చూశాడు. సహగమనాన్ని ఆపాలని

విశ్వప్రయత్నం చేశాడు. కాని అది సాధ్యం కాలేదు. రామమోహనుడి కళ్ళముందే, బంధువులు, పురోహితులు, ఆ అసహాయురాలిని చనిపోయిన ఆమె భర్త చితిమీద బలవంతంగా పడుకోబెట్టి సజీవంగా కాల్చి చంపారు! బాధతో, భయంతో, అసహాయంగా ఆమె అవసానదశలో, కాలిపోతూ చేసిన రోదన, రామమోహనుడి గుండెలను పట్టికుదిపివేసింది.

ఆ క్షణంలోనే రామమోహనుడు. భరించలేని ఆవేశంతో ఊగిపోతూ, "ఈ సతీసహగమన దురాచారం ఆపడానికి ఇక నా జీవితం ధారపోస్తాను!" అంటూ ప్రతిన పూనాడు. అదే ఇక తన జీవిత గమ్యంగా ఆయన ఒక తిరుగులేని నిర్ణయం తీసుకున్నాడు.

వెంటనే రామమోహనుడు, తన బహు భాషా పాండిత్యంతో అన్ని భాషల్లోని ప్రాచీన మత గ్రంథాలు అధ్యయనం చేశాడు. అయితే ఆయనకు ఆశ్చర్యం కలిగించిన విషయం—ఏ గ్రంథంలో కూడా సహగమనాన్ని బలపరచటంకాని, కనీసం అది వున్నట్టు కాని దాఖలాలు కనిపించలేదు. మౌర్యరాజుల, గుప్తరాజుల కాలంలో ఈ దురాచారం లేదు. కేవలం ముస్లిం దండయాత్రల కాలంలో, అదీ చాలా కొద్ది సందర్భాల్లో, శీలాన్ని, గౌరవాన్ని కాపాడుకునే నిమిత్తం మాత్రమే, ఈ ఆచారాన్ని కేవలం, రాజపుత్ర స్త్రీలు అనుసరించారు. ఆదర్శంగా ప్రారంభమైన ఈ చర్య కాలక్రమేపి, మొదట అలవాటు, తరువాత సాంప్రదాయమై చివరికి భర్త కోల్పోయిన ప్రతి స్త్రీ పట్ల ఇది నిర్బంధమైపోయింది. ఘోర సాంఘిక దురాచారమై నిలిచింది.

ఈ సతిసహగమన దురాచారాన్ని అరికట్టాలని ఆలోచించిన వాడు మొగల్ పాదుషా అక్బర్! అయితే ఆయన రాణుల్లో కొందరు రాజపుత్ర వంశీయులుండటంచేత, ఆయన గూడా, ఆ దురాచారాన్ని శాసన రూపంగా నిషేధించే పని చేయలేకపోయాడు.

బ్రిటీషు సామ్రాజ్యాన్ని బ్రిటీషు ప్రతినిధులుగా మన దేశానికి వచ్చిన బెంటింగ్ ఈ సతీసహగమన దురాచారాన్ని ఆపే ప్రయత్నం చేయటం వల్ల భారతీయులకు మనస్తాపం కలుగుతుందేమోనని ఉపేక్షించాడు. కారన్ వాలీస్ కూడా ఇదే విధంగా

ఆలోచించాడు. ఈ విషయంగా ఒకచట్టం చేద్దామనుకున్న ఆతనికి, ఈస్ట్ ఇండియా కంపెనీ డైరెక్టర్లు అడ్డుపడ్డారు. చివరికి ఈ విషయం ఇంగ్లాండ్‌లోని ప్రివీ కౌన్సిల్‌కూ చేరింది.

ఇంతలో రాజారామమోహనరాయ్ రంగంలోకి దిగి, సనాతన భావాలతో ఉన్న ఛాందస బ్రాహ్మణ పండితులను, మత పెద్దలను ఎదుర్కొని, వాళ్ళకు తెలియని చరిత్ర చెప్పి, సత్యాన్ని ప్రచారం చేయసాగాడు.

దానితో సనాతన భావాలను బలపరిచే వాళ్ళంతా కలసి, రాజా రాధాకాంతదేవ్ అనే మత పండితుణ్ణి రాజారామమోహనరాయ్ మీదకు పంపారు. అతను సహగమనం దురాచారం కాదని, దానిని నిషేధించకూడదంటూ ఇంగ్లాండ్‌లోవున్న ప్రివీకౌన్సిల్‌కు అప్పీలు కూడా చేశాడు. భారతీయుల సనాతన ఆచార వ్యవహారాలలో, సనాతన సాంప్రదాయాలలో ఈస్టిండియా కంపెనీ జోక్యం తగ దంటూ పెద్ద సంతకాల ఉద్యమం లాంటిది లేవదీశాడు.

బ్రిటీషు వాళ్ళ దృష్టికి, అప్పటికే ఆ విషయంలో, సహగమనాన్ని నిషేధిస్తూ చట్టం చేసే స్థాయికి ఆ సమస్యను ప్రచారంచేసిన రామమోహనరాయ్‌కు, మనస్తాపం కలిగించింది. ఆయనా రంగం లోకి దిగాడు. స్వయంగా తనే ఇంగ్లాండ్‌కు ప్రయాణమయ్యాడు. కొందరు ప్రగతి భావాలున్న భారతీయులు, ధనాన్ని చందాలుగా వేసుకొని ఆయనకు సాయంచేశారు చివరికి ఆయన ప్రివీకౌన్సిల్ ముందు తనే హాజరైన తన వాదాన్ని వివరించి, అందరినీ ఒప్పించి నెగ్గాడు చివరికి 1929, డిసెంబరు 4న రాజారామమోహనరాయ్ కోరిక ఫలించింది. బెంటింగ్ గవర్నర్ జనరల్‌గా ఉండగా, సతీసహ గమనం శాసనబద్ధంగా భారతదేశంలో నిషేధించాడు.

విజయంతో రాజారామమోహనరాయ్ భారతదేశానికి తిరిగి రాక ముందే, బ్రిస్టల్ నగరంలో ఆయన వుండగా అనారోగ్యంతో ఆయన కీర్తిశేషుడయ్యాడు. ఆయన సమాధి అక్కడే వుంది. భార తీయ ఛాందస భావాలతో పోరాడి భారతీయ పునరుజ్జీవనానికి అంకురార్పణ చేసిన ఆ మహాత్ముడి సమాధి, ఇంగ్లాండ్‌లో వుండటం బాధాకరమైన విషయమే.

## మానవత్వానికి ప్రతీక అబ్రహాం లింకన్

లింకన్ పేరు వినని వారు బహుశా వుండరేమో. మహా మాన వతావాది అయిన లింకన్ అమెరికా అధ్యక్షులైన అందరిలోనూ గొప్పవారనిపించుకున్నాడు. 1780లో అమెరికా సంయుక్త రాష్ట్రాలు ఏర్పడిన నాటి నుండి నేటి వరకు అమెరికన్ అధ్యక్షులలో ఇంతటి ప్రాచుర్యం పొందిన వ్యక్తి లేదు.



అబ్రహాం లింకన్ (1809-1865)

లింకన్ 1861 లో అధ్యక్షుడిగా ఎన్నికయ్యాడు. అది అమెరికన్ చరిత్రలో సంక్షుభిత సమయం. ఆ సమయంలో బానిసత్వంపై దేశం రెండుగా చీలిపోయే ప్రమాదంలో పడింది. అలాంటి పరిస్థితి నుండి దేశాన్ని రక్షించడమే కాకుండా 1863 లో బానిసత్వాన్ని రద్దు చేసి ప్రపంచ ఖ్యాతి నార్జించాడు. ఇంతటి అత్యున్నత మానవతావాది 1865 లో ఓ సినిమా థియేటర్‌లో ఓ మూర్ఖుని తుపాకి గుండుకు బలి అయ్యాడు.

ఆయన మానవత్వానికి ప్రతీకగా ఆయన చిన్ననాటి సంఘటన ఒకటి చాలు.

అబ్రహామ్ లింకన్ అప్పుడు పద్నాలుగేళ్ళ వయస్సు. అయితే అతను బలాఢ్యుడేకాక ఉదారస్వభావుడు! చురుకయిన బుద్ధి కుశలత వున్న అతను ఒకరోజు మిత్రులతో కలిసి వ్యాహ్యాళికి వెళ్ళి తిరిగి వస్తున్నాడు. ఏవో కబుర్లు చెప్పుకుంటూ వస్తున్న మిత్రులకు ఎదురుగా రౌతు లేని ఒక గుర్రం పరుగెత్తుకుంటూ వచ్చి ఆగింది.

ఆ గుర్రం చెవులు నిక్కబొడుచుకొని నిటారుగా వున్నాయి. కళ్ళు మాత్రం ఏదో మూగ బాధను వ్యక్తం చేస్తున్నట్లు ఎంతో ఆతురతతో వున్నట్లు కనిపించాయి.

"ఇదేమిటి! కళ్ళెం, జీను, రికాబు అన్నీ సిద్ధంగా ఉన్న ఈ గుర్రం మీద రౌతు ఏమయ్యాడో!" అన్నాడు అబ్రహాం ఆశ్చర్యంగా.

అప్పుడే చీకటి పడబోతుంది. అలా గుర్రం రౌతు లేకుండా రావడంలోని ఆంతర్యం అర్థం చేసుకున్న ఒక యువకుడు "ఈ గుర్రం రౌతు తప్పతాగి ఎక్కడో పడిపోయి ఉంటాడు. తన యజమానికీ సాయం చేసి అతడిని ఇంటికి చేర్చమని ఈ గుర్రం ఇలా మూగబాధతో అర్థిస్తోంది" అన్నాడు.

అప్పుడు మంచు ఉధృతంగా కురుస్తోంది. అందుకే మిత్రులంతా పెందలాడే ఇల్లుచేరే తొందరలో ఉన్నారు. కాని అబ్రహామ్ మాత్రం ఆ గుర్రం కళ్ళెం పట్టుకుని గుర్రం వెంట వెళ్ళడానికి సిద్ధపడ్డాడు. ఒక మిత్రుడు అబ్రహామ్‌ను వారిస్తూ "మిత్రమా! ఏ పానశాలలోనో ఒళ్ళు తెలియకుండా పడిపోయేట్టు తాగే తాగుబోతుల కోసం మనం మన కాలాన్ని, సమయాన్ని వెచ్చించడం వృథా. ఇంకా చీకటి పడితే దట్టంగా కురిసే ఈ మంచులో దారికూడా కనబడక పోవచ్చు. కాబట్టి మనం త్వరగా ఇల్లు చేరుకోవడం మంచిది" అని సలహా ఇచ్చాడు.

ఆ మిత్రుడి మాటని లెక్క పెట్టక అబ్రహాం "మిత్రమా!

తోటి మనిషికి ప్రమాదం జరిగినప్పుడు సాటి మనిషిగా అతడిని ఆదు కోవటం మన కర్తవ్యం. పైగా నోరులేని గుర్రమే అతడికోసం ఇంత ఆత్రుత పడుతోందే! మనుషులమై ఉండి మనం ఆ మాత్రం చేయలేమా? అయినా నేను చేసే ఒక మంచి పనివల్ల ఇంటికి ఒకగంట ఆలస్యంగా వెళ్ళితే నష్టమేమిటి?" అంటూ ఆ గుర్రం వెంట బయలుదేరాడు.

కాసేపు సందులు గొందులు తిప్పి ఆ గుర్రం అబ్రహాంను చివరికి ఒక పానశాలకు చేర్చింది. ఆ పానశాల మెట్ల ప్రక్కనే ఉన్న కాలవ దగ్గర మిలిటరీ దుస్తుల్లో ఒకవ్యక్తి అపస్మారక స్థితిలో పడి వున్నాడు.

అతడిని చూడగానే గుర్రం సకిలించింది. అబ్రహాం దాన్ని బట్టి ఆ వ్యక్తి ఆ గుర్రం యజమాని అని అర్థం చేసుకున్నాడు. వెంటనే అతడిని లేవనెత్తి గుర్రంమీద కూచోబెట్టి మెల్లిగా తన యింటికి చేర్చాడు.

ఎవరో అపరిచిత వ్యక్తిని పైగా బాగాత్రాగి మత్తులో అపస్మా రక స్థితిలో ఉన్న వాడిని రాత్రిపూట యింటికి తీసుకురావడం అబ్ర హాం చెల్లెలికి, తల్లికి యిష్టం లేదు. అయినా అతడు వాళ్ళ మాటను లెక్కచేయలేదు. అతడిని తన మంచంమీద పడుకోబెట్టి దుప్పటి కప్పాడు. అతడి గుర్రాన్ని తమ పశువులశాలలో కట్టి మేతవేశాడు.

అతడికి ఎటువంటి అవసరాలు కలుగుతాయో అని రాత్రి రెండు మూడుసార్లు నిద్రలేచి చూశాడు. కాని మర్నాడు మధ్యాహ్న నికి కాని అతడికి మెలకువరాలేదు తీరా మధ్యాహ్నం లేచి కళ్ళు తెరవగానే తాను ఎక్కడ ఉన్నాడో తెలుసుకుని విషయం గ్రహించి తనను అపస్మారకస్థితిలో రక్షించినవాడు ఆ బాలుడే అని గ్రహించి "బాబూ! చిన్నవాడివైనా అవసరమైన సాయంచేసి ప్రాణం కాపా డావు. రాత్రి కురిసిన మంచులో నేను వీధిలోనే అలాగే పడివుంటే

ఈ పాటికి ఈ లోకం శాశ్వతంగా వదిలి ఉండేవాడిని! నీ మేలు నేను వెయ్యి జన్మలకు కూడా మరువలేను" అన్నాడు కృతజ్ఞతతో.

తరువాత అతడు అబ్రహాంనుంచి వీడ్కోలు తీసుకొంటూ "బాబూ! చిన్నవాడివైనా ఉన్నతమైన మానవత్వాన్ని ప్రదర్శించావు. సంతోషం! నీ కేమైనా సాయం కావలిస్తే అడుగు. తప్పక చేసి పెడతాను" అన్నాడు.

అప్పుడు అబ్రహాం "మనదేశాన్ని సంరక్షిస్తున్న సైనికులు మిమ్మల్ని కాపాడటం నా కర్తవ్యంగా భావించి మా ఇంటికి తీసుకు వచ్చాను ఇంత చిన్న విషయానికి ప్రతిఫలాలు, కృతజ్ఞతలు ఏమిటి?" అన్నాడు నవ్వుతూ.

తరువాత ఆ సైనికుడే అమెరికా ప్రముఖ సైనికాధికారి అని అతడి ఉత్తరం చదివాక తెలిసి అబ్రహాం ఆశ్చర్యపోయాడు. తరువాత ఆ సైనికాధికారే అవసరమైన సమయంలో డబ్బు పంపి అబ్రహాం ఉన్నత విద్య అభ్యసించేందుకు సాయపడ్డాడు.

అబ్రహాం ఆ విధంగా ఉన్నత విద్య ముగించి, మొదట లాయరై తరువాత రాజకీయాల్లో ప్రవేశించి, స్వయంకృషితో, నిజాయితీతో అమెరికాకు అధ్యక్షుడు అయ్యాడు. అతడిలోగల మానవతా దృక్పథమే నీగ్రో బానిసత్వ విమోచన వంటి అనేక ఉత్తమ కార్యాలను అతడిచే చేయించింది.

# మహాగ్రంథ రచనకు నలభైఏళ్ళు తీసుకున్న కారల్ మార్క్స్

ఆధునిక ప్రపంచంలో. మనుషుల ఆలోచనా సరళిని ప్రముఖంగా ప్రభావితం చేసిన వాళ్ళలో అగ్రగణ్యుడు, కారల్ మార్క్స్.

మార్క్స్ బోధించిన సామ్యవాద సిద్ధాంతం (కమ్యూనిస్టు సిద్ధాంతాలు) గత శతాబ్ది కాలంగా, బాగా పరిణతి చెంది, ప్రపంచంలోనే తిరుగులేని శక్తివంతమైన రాజకీయ తాత్విక శక్తిగా రూపు దాల్చింది.



కారల్ మార్క్స్ (1818 - 1883)

మార్క్స్, జర్మనీలో, 1818లో యూదు కుటుంబంలో జన్మించాడు. మార్క్స్ బెర్లిన్‌లో బాన్, జీన్ విశ్వవిద్యాలయాల్లో విద్యగడించాడు. న్యాయశాస్త్రము తత్వ శాస్త్రము, మత శాస్త్రము అక్కడ అతను కూలంకషంగా అధ్యయనం చేశాడు. రాజకీయ శాస్త్రములో డాక్టరేటు పొందాక మార్క్స్, విప్లవాత్మకమైనకొత్త భావాలను మొట్టమొదటిసారి వ్యక్తపరచసాగాడు. పెట్టుబడివారి విధానానికి వ్యతిరేకంగా, కార్మికులకు అనుకూలంగా వున్న అతని కొత్త సిద్ధాంతాల ప్రభావాన్ని అతని పత్రిక వ్యాసాలుచూసి అప్పటి జర్మనీ ప్రభుత్వం భయపడింది. దీనితో అతన్ని జర్మనీ నుంచి బహిష్కరించింది,

మార్క్స్ ఫ్రాన్స్ చేరాడు. అక్కడా తన కార్మిక పక్షపాత సిద్ధాంతాలనే ప్రచారం చేయటం ప్రారంభించాడు. జర్మనీలో ఆగిపోయిన పత్రికను ఫ్రాన్సు రాజధాని ప్యారిస్ నుంచి ప్రారంభించే ప్రయత్నాలు చేశాడు. జర్మనీ ప్రభుత్వ అభ్యర్థనవల్ల ఫ్రాన్సు ప్రభుత్వము అతనిని, అతని పత్రికను బహిష్కరించింది.

1945 ప్యారిస్ నగరాన్ని వదలివెళ్ళే సమయానికి ముందే అతనికి అక్కడ ప్రముఖ తాత్వికవేత్త, మేధావి అయిన ఎంగిల్స్తో స్నేహం ఏర్పడింది. ఇద్దరి భావాలు, సిద్ధాంతాలు చాలా విషయాల్లో కలవటంచేత, ఇద్దరూ కలసి కొన్ని రచనలు చేశారు.

ఎంగెల్స్ మార్క్స్ ప్రతిభను గుర్తించాడు. అతనికి ఒక శిష్యుడుగా కేవలంఆరాధించటమేకాక, అతను 'దాస్ కాపిటల్' రచన చేయటంలో, ఆర్థికంగా ఎంతో సాయపడ్డాడు. అతనితో కలసి 'కమ్యూనిస్టు మ్యానిఫెస్టో' రచన చేశాడు.

మార్క్స్ ఇంగ్లాండ్‌లో శాశ్వతంగా స్థిరపడ్డాడు. శ్రామిక వర్గానికి ఒక సైద్ధాంతిక ఆయుధంగా, రాజకీయ అర్థశాస్త్రంగా ప్రసిద్ధమైన గ్రంథం "దాస్ కాపిటల్" రచనకు పూనుకున్నాడు.

ఈ మహా గ్రంథ రచనకు మార్క్స్ బ్రిటిష్ మ్యూజియమ్ గ్రంథాలయంలో గంటలు గంటలు కూర్చుని అనేక వేల గ్రంథాలు అధ్యయనం చేసాడు. వాటినుండి తనకు కావలసిన "నోట్సు" వ్రాసుకుంటూ, దాదాపు నలభై ఏళ్ళు కష్టపడి "దాస్‌కాపిటల్" గ్రంథ రచన పూర్తిచేసాడు.

ఇక్కడ మార్క్స్ మహాగ్రంథ రచనలో మునిగిపోయి లోకమే మరచిపోయివుంటే, అక్కడ అతని భార్య పిల్లలు దుర్భర దారిద్ర్యములో మ్రగ్గుతుండేవాళ్లు.

అలాంటి దుర్భర పరిస్థితిలో అతనికి ఆర్థికంగా సాయపడి

ఆదుకున్నవాడు ఎంగెల్స్. అతను సంవత్సరానికి 350 పౌండ్ల ధనాన్ని మార్క్స్‌కు పంపే ఏర్పాటు చేసాడు.

అయినా అతని పరిస్థితి ఏ మాత్రము అభివృద్ధికి నోచుకో లేదు.

మార్క్స్ అనారోగ్యముతో బాధపడేవాడు. 1881లో, పేదరికంలో క్రుంగి క్రుంగిన అతని భార్య చివరికి క్యాన్సర్ వ్యాధితో మరణించింది. అతని ఆరుగురు పిల్లలూ అనారోగ్యంతో, ఆకలితో బాధపడేవారు. ఇంట్లో వున్న ప్రతివస్తువూ తాకట్టు పెట్టటమో అమ్మ టమో చేయాల్సి వచ్చేది. అయినా ఇల్లు గడిచేదికాదు.

దుర్భర దారిద్ర్యములో అనుకూలించని కుటుంబపరిస్థితుల్లో ఆకలి బాధతోవున్న మార్క్స్ మాత్రం తన ఉద్గ్రంధ రచన, దానికి సంబంధించిన విషయ సేకరణలో మాత్రం ఎప్పుడూ అలసత్వం చెందేవాడుకాదు.

కారు చీకటిలో కాంతి రేఖలా అతనికి ఆర్థికంగా అండగా నిలిచింది ఒక్క ఎంగెల్స్ మాత్రమే. వివిధ పత్రికలకు వ్యాసాలు వ్రాయటంవల్ల మార్క్స్‌కు కొంచెం ఆదాయం వస్తుండేది. మార్క్స్ జర్మనీలో వ్రాసిన రచనలను ఎంగెల్స్ ఆంగ్లంలోకి అనువదించి, వివిధ పత్రికలకు పంపి, ఎంగెల్స్ ఆ విధంగా కొంత ఆదాయం సమకూర్చేవాడు. దేశదేశాలలో కార్మిక సంఘాల స్థాపనకు, వాటి నిర్మాణాత్మక కృషికి మిత్రులిద్దరు శ్రమించేవారు.

మార్క్స్ రచించిన ఉద్గ్రంథం "దాస్ కాపిటల్" మొదటి భాగం 1867 లో ప్రచురించబడింది. అప్పటికి మార్క్స్ జీవించే వున్నాడు. తరువాత రెండు భాగాలు ఎంగెల్స్ ప్రచురించాడు.

"దాస్ కాపిటల్" రచనతో మార్క్స్ ఎంత గొప్పమేధావో అతను ఇచ్చిన "ప్రపంచ కార్మికులారా ఏకంకండి!" అనే సందేశం ఎంత బృహత్తర ప్రభావం కలిగించిందో సర్వలోక విదితమే.

# లేడీ విత్ ది లాంప్



ఫ్లారెన్స్ నైటింగేల్
**(1820–1910)**

మానవాళికి మహత్తర సేవ చేసిన మహిళలు చాలా మంది వున్నా ఫ్లారెన్స్ నైటింగేల్‌కున్న పేరు ప్రతిష్ఠలు. ఆమెకు చరిత్రలో శాశ్వతంగా లభించిన స్థానం అనితర సాధ్యమనే చెప్పాలి.

నైటింగేల్ 1820లో, ఇటలీలో జన్మించింది. బాగా ధనిక కుటుంబానికి చెందిన అమ్మాయి కావటంతో ఎంతో అల్లారుముద్దుగా పెరిగింది. చక్కగా వివాహం చేసుకుని వైవాహిక, జీవితం గడిపి, సంసారసుఖాలు పొందేవీలు ఆమెకుంది.

అయితే ఆమెకెందుకో మానవసేవ చేయాలనే సంకల్పం కలిగింది. అది భగవంతుడి పిలుపుగా ఆమె భావించింది.

దీనితో ఆమెలో అశాంతి చెలరేగింది. ఎటూ నిర్ణయించుకోలేక ఆమె కొన్నాళ్ళు బాధపడింది. ఆమె అశాంతికి తల్లిదండ్రులు కలవరపడ్డారు. చివరికామె ఒక నర్సుగా జీవితాన్ని ప్రారంభించాలని నిర్ణయించుకుని, తన నిర్ణయాన్ని దృఢంగా తల్లిదండ్రులకు తెలిపింది. వాళ్ళు ఎంతో వ్యతిరేకించారు. చివరికి ఆమె పట్టుదలవల్ల ఒప్పుకోక తప్పిందికాదు.

1854లో, క్రిమియా యుద్ధం ప్రారంభం కాగానే, టర్కీలోని బ్రిటిష ఆర్మీ ఆసుపత్రికి ఆమె నర్సుగా చేరుకుంది. ఆమెతోపాటు నలభైమంది నర్సుల బృందం అక్కడకు వెళ్ళింది.

అక్కడ ఆసుపత్రిలో, అంతా గందరగోళంగా వుంది. గాయపడి వచ్చిన సైనికులకు అక్కడ సరైన మందులుగాని, వసతులుగాని లేవు, టవళ్ళు, బేసిన్లు, ట్రేలు లేవు, బట్టశుభ్రంచేసే వీలు లేదు. అక్కడ పనిచేసే తక్కిన ఉద్యోగస్తులు కూడా ఎవరూ సహకరించే వాళ్ళుకాదు.

అలాంటి పరిస్థితుల్లో ఫ్లారెన్స్ నైటింగేల్ నిస్పృహ చెందలేదు. తన సొంత డబ్బుతో ఆమె హాస్పిటల్‌కు కావలసిన సబ్బులు, టవళ్ళు, బేసిన్లు కొన్నది, పారిశుద్ధ స్థితిని మెరుగు పరుస్తూ వంటశాలలను, బట్టలు శుభ్రపరచే స్థలాలనూ ఆమె మెరుగు పరచింది.

రోగులకు బ్రష్షులు, పేస్టులు, దువ్వెనలు, ఆహారం తినటానికి వీలుగావాడే ఫోర్కులు, చిన్న చిన్న కత్తులు ఆమే స్వయంగా ఇచ్చింది. కొన్ని మందులను, బ్యాండేజీకి కట్టే వస్త్రాలను, దూదిని తెప్పించింది.

ఆమె నిద్రాహారాలు మాని రాత్రనక పగలనక, చేతిలో ఒక కొవ్వొత్తి పట్టుకొని, బాధలోవున్న క్షతగాత్రులకు, రోగులకు సేవలు చేయసాగింది.

ఆమె చల్లటిచూపు, ఆమె మృదుమధుర భాషణ, ఆమె సపర్యలు అందిన రోగులంతా, ఆనందంగా ధైర్యంతో కోలుకోసాగారు మరణాల శాతం మూడో వంతుకు తగ్గింది. దీపం పుచ్చుకుని, ఆమె రాత్రంతా నిద్రపోకుండా తిరుగుతుండటంచేత ఆమెకు "లేడీ విత్ ది ల్యాంప్" అనే పేరు, గౌరవంగా ఇవ్వబడింది.

ఆసుపత్రులలో ఎలా రోగులకు సేవలు చేయాలో సూచిస్తూ ఆమె కొన్ని గ్రంథాలు వ్రాసింది. ఆసుపత్రుల నిర్వహణకు సంబంధించిన వివరాలు కూడా ఆమె మరికొన్ని గ్రంథాలుగా వ్రాసింది. ఇవన్నీ తరువాత ఆధునికనర్సింగ్ విద్యావిధానానికి మూలమయ్యాయి.

అలా తన జీవితంలో మానవాళికి సేవలుచేస్తూ, అంకితభావంతో బ్రతికిన నైటింగేల్, తొంభయి ఏళ్ళు జీవించి తన సేవలను అందించి 1910లో ఇంగ్లాండులో కీర్తిశేషురాలైంది.

# హాస్య చతురోక్తుల పాదుషా బెర్నార్డ్‌షా

ప్రపంచ ప్రసిద్ధ సాహితీవేత్తగా షేక్స్‌పియర్ తరువాత, అంత గొప్ప సాహితీవేత్తగా గుర్తింపు పొందినవాడు, జార్జ్ బెర్నార్డ్‌షా.

1856లో ఐర్లాండ్‌లో పుట్టిన షా, తల్లిదండ్రులకు కడపటి వాడు. షా తండ్రి జమీందారీ వంశానికి చెందినవాడైనా, అతనికి జమీందారు హోదాతో జీవించటం అలవాటయ్యింది తప్ప, తాత తండ్రుల జమీను, (భూమి) కాని డబ్బుకాని, వారసత్వంగా లభించ లేదు...పైగా తాగుడు వ్యసనంతో దానికి బానిస అయిన షా తండ్రి, ఇంటిని సరిగా పోషించుకునే స్థితిలో ఉండేవాడుకాదు. ఇల్లు గడవని పరిస్థితి నుంచి బయటపడటానికి, షా తల్లి సంగీత పాఠాలు చెప్పుకో వలసివచ్చేది.

షా బాల్యంలో దుర్భర పేదరికంలో గడచింది. తండ్రి కుటుంబ పోషణ చేయకపోగా, షాను, షా అన్నలను చెల్లెళ్ళను బూతులు తిడుతూ కొడుతుండేవాడు. తండ్రి అరిచే అరపులు చేసే పనులు, చుట్టుప్రక్క ఇరుగుపొరుగు వాళ్ళకు తెలియకుండా వుండా లని, షా వాళ్ళ నాన్న తిట్ల దండకం ఎత్తుకోగానే తను నోటి కొచ్చిన పాటలు పద్యాలు పాడుతూవుండేవాడు.

ఎవరైనా "ఏమిటి మీ ఇంట్లో ఆ అరుపులు కేకలు ? అని ప్రశ్నిస్తే "మా నాన్న ఏదో నాటకంలో—ఒక దృశ్యం రిహార్సలు చేస్తుంటే...నాకు చేతనైన విధంగా నేను సాయపడుతున్నాను !" అంటూండేవాడు.

పేదరికంవల్ల షా 1867 నుంచి 1871 వరకు మాత్రమే స్కూల్లో చదవగలిగాడు. ఇక కుటుంబాన్ని ఆదుకోవటానికి అతను తన పదిహారవ ఏట ఒక గుమస్తాగా ఉద్యోగం ప్రారంభించాడు.

షా తల్లి 1876లో లండన్‌కు, జీవనోపాధి వెతుక్కుంటూ వెళ్ళేవరకు, షా ఆ చిన్న ఉద్యోగమే చేశాడు.

షాకు చిన్నప్పటి నుండీ, సాహితీవేత్త అవాలనే ఉత్సాహం ఉండేది. అయితే సాహితీ రంగంలో అప్పటికే ప్రసిద్ధులైన వారు పాతుకుపోయి ఉండటంతో, షా వంటి ఔత్సాహికులకు స్థానం లభించేదికాదు.

1879లో షా నవలలు వ్రాయటం మొదలు పెట్టినా, అవి ఏవో చిన్నచిన్న పత్రికల్లో సీరియల్స్‌గావచ్చినా, వాటిని తరువాత పుస్తకరూపంలో అచ్చువేసే ముద్రాపకులు లభించేవాళ్ళు కాదు. 1884లో షా వ్రాసిన 'యాన్ అన్ సోషల్ సోషలిస్ట్' అనే నవల రూపంలోవచ్చింది కాని దానికి ప్రజాదరణ మాత్రం లభించలేదు.

తరువాత షా కొన్ని పత్రికలకు సంగీత విమర్శకుడుగా పనిచేశాడు. తరువాత నాటక విమర్శకుడుగా మారాడు. అప్పుడే షేక్‌స్పియర్ నాటకాలను ఘాటుగా విమర్శించాడు. షాకు, 'సోషలిజమ్' నచ్చి, అతను సోషలిస్ట్ అయ్యాడు. తరువాత అతను 'ఫెబియన్ సంఘపు' సభ్యుడు అయ్యాడు.

1892లో "విడోయర్స్ హవుసెస్" అనే నాటక రచన వెలుగు చూడటంతో, షా నాటక రచయితగా ప్రసిద్ధుడయ్యాడు. ఇరుకు సందుల్లో గొందుల్లో వుండే పేదల జీవితాలను ఆ రచన దర్పంపట్టింది. ఆ రచనతో సాహిత్యాన్ని సాంఘిక సమస్యలవైపుకు ప్రజలదృష్టి మరల్చి వాళ్ళను ఆ విషయంగా ఆలోచించేట్టుచేశాడుషా.

షా నాటకాలు కొన్ని పాఠకుల్ని ఆకర్షించినంతగా ప్రేక్షకులను ఆకర్షించలేదు. కాని గ్రాన్‌విల్లి బార్కర్, షా నాటకాలను ప్రదర్శించటం ప్రారంభించటంతో షా నాటకాలు ప్రేక్షకాదరణకు పాత్రమయ్యాయి. అలాంటి నాటకాలలో "జాన్ బుల్స్ అదర్ ఐలెండ్" అనే నాటకం 1904లో బాగా ప్రఖ్యాతమైంది.

క్రమేపీ షా, నాటక రచయితగా కీర్తి శిఖరాలు అధిరోహించాడు. లండన్ మహానగరంలోని ప్రఖ్యాతి వహించిన "కోర్టు థియేటర్"లో, షా వ్రాసిన నాటకాలు వరుసగా రెండేళ్ళు ప్రదర్శించబడటం గొప్ప విశేషంగా చెప్పవచ్చు.

షా వ్రాసిన ప్రతి నాటకంలో, ఏదో ఒక సాంఘిక ఇతివృత్తాన్ని ఆయన విశ్లేషించటం, మనకు కనిపిస్తుంది.

"మేజర్ బార్బరా" నాటకంలో, మత ప్రచార ముసుగులో సాగే-కథ వెనక కథను చెప్పాడు. సైన్సులో మూఢ నమ్మకాలను విమర్శిస్తూ "ది డాక్టర్స్ డైలమా" వ్రాశాడు.

ఈయన వ్రాసిన "పిగ్మాలియన్స్", "సీజర్ అండ్ క్లియోపాట్రా," ది డెవిల్స్ డిసైపుల్" లాంటి ప్రఖ్యాత నాటకాలతోపాటు వాటికి సుదీర్ఘ పీఠికలూ వ్రాశాడు.

షా నాటకాలలో, ఉత్కంఠత, ప్రేమతోపాటు హాస్యం, వ్యంగ్యం కూడా ప్రేక్షకులను అమితంగా ఆకర్షిస్తుంది. 1925 లో షాకు "నోబెల్" బహుమతి రావటంతో, ఆయన ప్రపంచ సాహిత్యంలోనే సుస్థిరస్థానం పొందాడు.

రచయితగా ఇతరులకు నీతులు చెప్పటమేకాక వాటిని జీవితంలో ఆచరించి చూపిన మహామనిషి బెర్నార్డుషా.

ఆయన ఒకసారి వధ్య శిలకు చిత్రవధలతో తీసుకుపోబడుతున్న ముసలి గుర్రాన్నిచూసి "ఇక జీవితంలో మాంసం ముట్టను !"

అంటూ ప్రతిజ్ఞచేసి దాన్ని జీవితాంతం ఆచరించ బూనాడు. షా మత్తు పానీయాలు సేవించేవాడుకాదు పొగ త్రాగటం ఆయనకు పడదు.

హాస్య రచయితగానేకాక, హాస్య సంభాషణా చతురుడుగా కూడా షా గట్టివాడు.

ఒకసారి షా ఆధునిక నాటక రంగం మీద తాను తెచ్చిన విప్లవాత్మక మార్పులను గురించి ఒక గంట ఉపన్యాసం ఇచ్చాడు.

అయినా అతనిఉపన్యాసంవిన్న పత్రికా విమర్శకులు "లక్ష చెప్పండి ! మీ అభిప్రాయాలతో మేము ఏకీభవించలేము !" అన్నారు.

వెంటనే షాకు పళ్లుమండి, ఏ విషయాన్నయినా విడమరచి చెప్పగలముగాని, అది అర్థంచేసుకునే తెలివితేటలు ఎవరివ్వగలం ?" అన్నాడట.

షా ఒకరోజు ఒక పాతపుస్తకాల షాపులో పుస్తకాలు తిర గేస్తుండగా, తను స్వంతంగా ఓ ప్రియమిత్రుడి పేరు వ్రాసి బహూ కరించిన తన పుస్తకమే కనిపించిందట.

షాకు కోపంవచ్చి ఆ పుస్తకాన్ని కొని, మళ్ళీ అదే మిత్రుడికి రిజిష్టరు పోస్టులో పంపుతూ మరల తిరిగి అభినందనలతో_ షా అని వ్రాసి పంపాడట.

ఒకసారి ఒక మిత్రుడు షాని "మీరింత గొప్పవారు కావటం లోని ఆంతర్యం ఏమిటి ?" అంటూ అడిగాడట.

వెంటనే షా "నేను చిన్నప్పటి నుంచి పది ప్రయత్నాలు చేస్తే వాటిలో తొమ్మిది పూర్తిగా విఫలమయ్యేవాడిని! ఇక ఇలాకాదని వెయ్యి ప్రయత్నాలు చేశాను ! అలా నూరు విజయాలు సాధించా నన్నమాట !" అన్నాడట.

అలాటి హాస్యప్రవృత్తిగల ప్రముఖ రచయిత విమర్శకుడు నాటక రచయిత తన తొంభైయైదవ యేట, 1950లో కీర్తిశేషు డయ్యాడు.

# ఆదర్శజీవి మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ



మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ
**(1869–1948)**

మహాత్మా గాంధీజీ స్థాపించిన సేవాగ్రామ్ ఆశ్రమం ఎంతో ఆదర్శంగా నడిచేది. అక్కడ కుల మత భేదాలు, ధనిక పేద తారతమ్యాలు లేవు. అది ఒక ఆదర్శ గ్రామంలాగే వుండేది. దీనికంతకూ మూలం గాంధీజీ మానవతా దృక్పథం.

ఒకరోజు గాంధీజీ తన అనుచరులతో కలిసి, సాయంత్రపు వ్యాహ్యాళికి వెళుతున్నారు. ఆలా రోజూ వ్యాహ్యాళికి వెళ్ళి సాయంత్రం అయ్యేసరికి ప్రార్థనకు తిరిగి రావడం ఆయన దినచర్య.

ఆలా ఆ రోజు ఆయన వ్యాహ్యాళికి బయలుదేరి కొంతదూరం నడవగానే "నమస్కారం బాపూజీ" అన్న గొంతు వినిపించింది.

ప్రతి నమస్కారంచేస్తూ గాంధీజీ ఆ శబ్దం వచ్చిన వైపు చూశాడు. అక్కడ ఓ గడ్డపు వృద్ధుడు ఓ చిన్న బట్టలమూట, చిన్న రాట్నంతో కన్పించాడు.

ఆ వ్యక్తిని గుర్తుపట్టిన గాంధీజీ "మీరు అప్పుడే రాకుండా ఉండవలసింది. నేను మీకు ఉత్తరం వ్రాసేవరకు ఆగలేకపోయారా?" అన్నారు బాధగా.

ఆ మాటలకు వెంటనే సమాధానం చెప్పలేని ఆ వృద్ధుడు కాస్సేపు తటపటాయించి "రెండవ ప్రపంచ సంగ్రామాన్ని గురించి మీరు చేసిన ప్రకటన మీ అనుచరులకు ఎవరికీ నచ్చలేదని, ఫలి

తంగా మీరు చివరికి ఒంటరిగా ఆశ్రమంలో మిగిలిపోయే పరిస్థితి రావచ్చునని వ్రాశారు. మీరు ఒంటరిగా వుండడం వూహించలేని నేను మీకు తోడుగానైనా ఉండవచ్చని మీ ఉత్తరం కోసం ఎదురు చూడకుండా వచ్చేశాను" అన్నాడు.

ఆ మాటలతో చలించిపోయిన గాంధీజీ "మీరు రావడం సరే...కాని నేనింకా అనుమతి తీసుకోలేదు!" అన్నారు బాధగా.

గాంధీజీ మాటల్లో ఆంతర్యం గ్రహించిన ఆ వృద్ధుడు 'పోనీ లెండి ఈ రాత్రికి ఈ చెట్టుక్రింద పడుకొని తెల్లవారాక వెళ్ళిపోతాను. దయచేసి నేను నా రాట్నంతో వడికిన నూలు స్వీకరించండి" అన్నాడు మూటలో నుండి నూలు తీసి.

గాంధీజీ తన మనవడైన కనూగాంధీని ఆ వృద్ధుడు ఇచ్చే వడికిన నూలు స్వీకరించమన్నారు. ఆ పిల్లవాడు ఆ నూలు స్వీకరించాడు.

అయితే వారిద్దరి మధ్య జరిగిన సంభాషణ దానిలోని ఆంతర్యం మాత్రం ఎవరికి అర్థం కాలేదు, గాంధీజీ మాత్రం ఎంతో బాధపడుతూ ముభావంగా, ఏదో ఆలోచిస్తున్నట్టు అన్యమనస్కంగా వుండిపోయారు ప్రార్థన జరిగేవరకు!

ఆ రాత్రి ప్రార్థనజరిగాక అందరినీ సమావేశపరచి "మిత్రులారా! సోదరీమణులారా! మన ఆశ్రమంలో ఓ వ్యక్తి ఉండటానికి మీ అందరి అనుమతి కోరుతున్నాను. అతడిపేరు పరశురామశాస్త్రి. సద్బ్రాహ్మణుడు, నిరుపేద, అనాథుడు, పైగా వృద్ధుడు. అతడు గొప్ప సంస్కృత పండితుడు, దురదృష్టవశాత్తు కుష్ఠురోగిగా బాధపడుతున్నాడు. నేనుచేసే ప్రకృతి వైద్యంతో, ప్రార్థనలతో ఆశ్రమ వాతావరణంలో స్వస్థత చేకూరుతుందనే నమ్మకంతో వచ్చాడు. మీరందరూ ఐక్యంగా అతడి నివాసం ఈ ఆశ్రమంలో ఓ మారుమూల వుంచడానికి అనుమతిస్తే సంతోషం!" అన్నాడు. ఆశ్రమవాసులకు అప్పటికి గాని ఆ పూట గాంధీజీ అన్యమనస్కంగాఎందుకువున్నారో అర్థం కాలేదు. అందరూ ముక్తకంఠంతో గాంధీజీ కోరికను ఆమోదించారు.

పరశురామశాస్త్రికి అప్పటికి అప్పుడే ఓ మారుమూలకుటీరం నివాసంగా ఇవ్వబడింది. అందరూ సంతోషించారు. గాంధీజీ అతడికి చికిత్స ప్రారంభించారు. ఇది జరిగిన కొన్నాళ్ళకు ఢిల్లీనుండి భారత వైస్రాయ్‌తో సంప్రదింపులకు రావలసిందనే వర్తమానం గాంధీజీకి వచ్చింది. గాంధీజీ ఢిల్లీలో సంప్రదింపుల్లో పాల్గొంటున్నారు. అది రెండవ ప్రపంచ యుద్ధం జరుగుతున్న సమయం కావడాన ఆ చర్చలకు ఎంతో ప్రాముఖ్యం వుంది.

అయితే అదివరకు గాంధీజీ ఆ వైస్రాయ్ చాలాసార్లు అనేక సంప్రదింపులు జరిపివున్నారు. కాని గాంధీజీ ఎన్నడూ అన్యమనస్కంగా లేరు. సంప్రదింపుల అనంతరం అదే విషయం వైస్రాయ్ స్నేహపూర్వకంగా అడగ్గా 'మీరు పిలిపించారని నేను ఇక్కడ ఢిల్లీలో వున్నాను. కాని నా మనసంతా సేవాగ్రామ్ ఆశ్రమంలో వ్యాధిగ్రస్తుడై మంచంపట్టి వున్న పరశురామశాస్త్రి అనే కుష్ఠురోగి దగ్గరేవుంది నేను అతడికి వైద్యంతో పాటు అనేక సపర్యలు చేస్తాను నా ముఖంచూసి అతడిని తక్కినవారు ఆశ్రమంలోకి అనుమతించారు, నేను లేనప్పుడు అతడి పరిస్థితి ఎలావుంటుందో వూహించుకోగలను. అందుకే నా మనసు ఇక్కడి చర్చలమీద కేంద్రీకరించలేకపోతున్నాను" అన్నారు గాంధీజీ విషయం ఏమిటో వివరిస్తూ.

ఆ మాటలకు అచ్చెరువందిన వైస్రాయ్ గాంధీజీ మానవతా దృక్పథాన్ని మెచ్చుకుంటూ ఆయన ప్రయాణం త్వరితంగా సాగడానికి అవసరమైన ఏర్పాట్లు వెంటనే చేయించాడు.

ఇంతటి మానవతావాది అయిన గాంధీ 1869లో పుట్టాడు. ఇంగ్లండులో చదువుకున్నాడు. బ్రిటీష్ పరిపాలనను తన అహింసా విధానాలద్వారా ఎదుర్కొని 1920 ప్రాంతానికి భారతీయులకు ఆరాధ్య దైవమైనాడు. ఆయన సారథ్యంలో మనదేశం 1947 లో స్వాతంత్ర్యం సాధించింది.

స్వతంత్ర భారతదేశపు పురోభివృద్ధిని కళ్ళారా చూడకుండానే 1948 జనవరిలో ఓ మత తత్వవాది తుపాకి తూటాకు బలయ్యాడు. కాని భారత ప్రజానీకం దృష్టిలో గాంధీజీ అమరుడే.

# మనోధైర్యానికి మారుపేరు విన్‌స్టన్ చర్చిల్



విన్‌స్టన్ చర్చిల్
(1874–1965)

ఒక నాలుఁగేళ్ళ పిల్లవాడు తన అన్నతో బొమ్మ సిపాయీల ఆట ఆడుతున్నాడు. ఆ పసివాడి అన్నకు చాలా ఎక్కువ సంఖ్యలో బొమ్మ సిపాయిలు, యుద్ధ సామాగ్రి, ఫిరంగులూ వున్నాయి. ఆ నాలుగేళ్ళ పసివాడికి కొద్ది మంది బొమ్మ సిపాయిలే వున్నారు. అతడికి యుద్ధసామాగ్రి, మర పిరంగులు లేనేలేవు. పసిపిల్లలు ఆడే ఆట అది. ఈ ఆట ఆడుతుండగా పెద్దవాళ్ళెవరన్నా మధ్యవర్తులుఁగా వుండి ఆ యుద్ధపు ఆట నియమాలు సక్రమంగా నిర్వహింపబడేలా చూస్తూ ఏ పక్షం గెలిచిందో నిర్ణయిస్తారు.

అయితే ఎక్కువ సిపాయిలు, మందుగుండు సామాగ్రి అధికంగా లేని ఆ నాలుగేళ్ళ పసివాడే ఎంతో చాకచక్యంగా తన అన్న వేసే అన్ని ఎత్తుల్ని చిత్తు చేస్తున్నాడు. చివరికి ఆ యుద్ధపు ఆటకు మధ్యవర్తిగా వున్న తండ్రికి ఆశ్చర్యం కలిగేట్టు ఆ నాలుగేళ్ళ పసివాడే అన్నను ఎంతో చాకచక్యంతో చిత్తుచేశాడు.

ఈ సంఘటన జరిగాక అప్పుడు ఆ తండ్రికి అనిపించింది "వీడు విద్యలో కంటే యుద్ధ రంగంలో సైనికాధికారిగా మనోధైర్యంతో బాగా రాణిస్తాడేమో!" అని.

ఆయన అనుకున్నట్టే ఆ బాలుడు చదువులో చాలాసార్లు తప్పాడు. అన్ని తరగతుల్లో మొద్దబ్బాయిగా చెడ్డపేరు తెచ్చుకోవ

డంతో ఆ అబ్బాయిని చివరికి ఒక మిలటరీ పాఠశాలలో చేర్చాడు తండ్రి. ఆ అబ్బాయి జీవితంలో ఓ అనుకోని సంఘటన ఆ మిలటరీ స్కూల్లో సంభవించింది.

ఆ పసివాడు చేరిన మిలటరీ స్కూలు విద్యార్థులకు చదువుతో పాటు వసతి,భోజన సౌకర్యాలు అక్కడేవుంటాయి. ఒక పక్కచదువు చెబుతూనే అక్కడే యుద్ధ విద్యలలో శిక్షణ ఇస్తారు. తరువాత వాళ్ళు ప్రభుత్వోద్యోగులుగా సైన్యంలో చేరవచ్చు. ఆ విధంగా ఈ మొద్ద బ్బాయిని సైన్యాధికారిని చేయడానికి తండ్రి నిర్ణయించుకున్నాడు.

ఆ సైనిక విద్యాలయం హారో పట్టణంలో వుంది. అందులో ఒకపెద్ద ఈతకొలను వుంది. అది పెద్దలోతు లేకపోయినా తనకంటే చిన్న వాళ్ళను పెద్ద పిల్లలు ఆ ఈత కొలనులో పడేసి వాళ్ళు ఈద డంరాక సతమతమవుతూ భయంతో ఏడుస్తుంటే వినోదిస్తుంటారు. ఇలా చిన్న పిల్లలను ఏడ్పించడంలో "అమెరీ" అనే దున్నపోతులాంటి ఆకతాయి పిల్లవాడు ప్రసిద్ధుడు.

ఒక రోజున "అమెరీ" సైనిక స్కూల్లోని పసివాళ్ళనందరినీ పట్టుకొచ్చి ఈత కొలనులోకి విసరేసి వాళ్ళు భయంతో ఏడుస్తుంటే చప్పట్లు చరిచి వినోదిస్తున్నాడు. ఇంతలో అప్పుడే కొత్తగా చేరిన ఈ పిల్లవాడు అమెరీని అమాంతంగా నీటిలోకినెట్టి తప్పట్లుకొట్టాడు. అక్కడే వున్న పిల్లలంతా పెద్దపెట్టున నవ్వారు. దాంతో అతనికి బుద్ధివచ్చి పిల్లల్నిలా ఏడిపించటం మానేశాడు.

ఇంతకీ ఆ పసివాడు ఎవరోకాదు. ఇంగ్లాండ్‌ను రెండవ ప్రపంచయుద్ధ కాలంలో కాపాడిన సర్ విన్‌స్టన్ చర్చిల్.

ఆయన గొప్పసైనికాధికారి గానేకాక ఇంగ్లాండ్ ప్రధానిగా, ఆదర్శ రాజకీయవేత్తగా రచయితగా విశ్వవిఖ్యాత కీర్తినార్జించాడు. సైనిక విద్యాలయంలో తన కంటే ఎంతో పెద్దవాడికి బుద్ధిచెప్పినట్లే

రెండవ ప్రపంచ యుద్ధంలో జర్మనీ, ఆఫ్రికా, ఇటలీ వంటి దేశాల్ని ఒక పట్టుపట్టి 1945 లో ఐక్యరాజ్యసమితి స్థాపనకు మూలకారకుడు అయ్యాడు. ఇంగ్లండ్‌తోపాటు ప్రపంచదేశాల మన్ననలను పొందాడు.

కొందరు చర్చిల్‌ని ఇంగ్లీషుభాష మాట్లాడే మానవకోటిలోనే అత్యంత ప్రతిభావంతుడంటారు. మరి కొందరు ఈ శతాబ్దంలో జీవించిన అత్యంత ప్రతిభావంతుడైన ఆంగ్లేయుడని కొనియాడతారు.

1940 లో ఫ్రాన్స్ జర్మనీ చేతిలో ఓటమి దశలో వుంది. అదే సమయంలో అప్పటి ఇంగ్లండ్ ప్రధాని చాంబర్లిన్ గత్యంతరంలేని పరిస్థితులలో తన పదవికి రాజీనామా చేశాడు. అప్పుడు ఇంగ్లండ్‌రాజు చర్చిల్‌ని ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయ్యమని ఆహ్వానించాడు.

ఆయన ప్రతిభా పాటవాలు ఐదేళ్ళ శ్రమతో చివరికి నాజీ హిట్లర్‌ని ఓడించగలిగాడు.

అటు తర్వాత ద్వితీయ ప్రపంచ జ్ఞాపకాలను ఆరు పుస్తకాలుగా వ్రాశాడు. దానికి ఆయనకు నోబుల్ బహుమతి కూడా వచ్చింది.

# మహాగణితశాస్త్రవేత్త శ్రీనివాస రామానుజన్

ప్రపంచ చరిత్రలో, గొప్ప మేధావులుగా, ప్రముఖులుగా గుర్తింపు పొందినవాళ్ళు చాలామంది అల్పాయుష్కులు కావటం విధి విలాసమే అనాలేమో!

మహాజ్ఞానిగా ప్రసిద్ధికెక్కిన ఆదిశంకరాచార్యులవారు, వివేకానందుడు, గొప్ప కవయిత్రిగా గణనికెక్కిన తోరూదత్ గొప్ప దేశభక్తులుగా ప్రాణత్యాగాలు చేసిన భగత్ సింగ్, చంద్రశేఖర అజాద్, సుభాస్ చంద్రబోస్ ఇలా చాలామందే వున్నారు. ప్రముఖ ఆంగ్ల కవిత్రయంగా భావకవితకు పేరుగన్న కీట్స్, షెల్లీ, బైరన్ కవులు ఈ కోవకే చెందుతారు.

పైన పేర్కొన్న వారంతా ఒక ఎత్తయితే ముప్పయి మూడేళ్ళకే ఆచంద్రతార్కమైన కీర్తిని గడించి, భారతీయులకు అత్యంత గౌరవ ప్రతిపత్తి కలిగించిన మేధావి శ్రీ శ్రీనివాస రామానుజన్.

గణితశాస్త్రంలో రామానుజన్ ప్రతిభ, చిన్న క్లాసులో, చిన్నతనంలోనే, ఒక లెక్కల క్లాసులో అవగతమైంది. అది మరీ ప్రాథమిక స్థాయిక్లాసు గణితం చెప్పే మాస్టారు కేవలం బొమ్మలువేసి తీసివేతలు చెబుతూ "మూడు అరటిపళ్ళు ఉన్నాయనుకోండి! ముగ్గురు పిల్లలున్నారనుకోండి. అప్పుడు ఒక్కో పిల్లవాడికి ఎన్ని అరటికాయ లొస్తయ్!? "అన్నారు. "తలా ఒక అరటికాయ వస్తుందిసార్!" అన్నాడు ఒక కుర్రవాడు.

అలా అధ్యాపకుడు లెక్కలు చెబుతుండగా ఒక విద్యార్థిలేచి

"సార్! ఒకవేళ ఎవరికీ అరటికాయలు పంచలేదనుకోండి, అయినా ప్రతివాళ్ళకీ అరటికాయ లభిస్తుందా?" అన్నాడు.

ఆ ప్రశ్న అర్థంకాని పిల్లలు అది ఒక పిచ్చి ప్రశ్న అంటూ నవ్వారు. కాని ఆ గణితధ్యాపకుడు ఆ ప్రశ్నను సరిగానే అర్థం చేసుకున్నాడు. రామానుజన్ అడిగిన ప్రశ్న వాళ్ళకు అర్థంకాక పోవటం వల్లనే నవ్వుతున్నారని చెబుతూ అసలు రామానుజన్ అడి దింది. "సున్నాని సున్నాతో విభజిస్తే వచ్చే సమాధానం సున్నాయేనా అని?" అంటూ వివరించాడు.

ఆ ప్రశ్నే పిల్లలకు అర్థంకాలేదు. ఇక సమాధానం ఎలా అర్థమవుతుంది?

అలాటి జటిల ప్రశ్నవేసిన ఆ కుర్రవాడే, తరువాత జగత్ ప్రఖ్యాతి వహించిన శ్రీనివాస రామానుజన్.

రామానుజం అడిగిన ఆ ప్రశ్నకు సమాధానం చెప్ప గలిగినవాడు, రెండు వేల సంవత్సరాల గణితచరిత్రలో, ఒక్క భాస్కరా చార్యుడే కనిపించాడు.

పేదరికంలోపుట్టిపెరిగిన రామానుజన్ పదమూడేళ్ళకే లోనీస్ ట్రిగ్నామిట్రీ లెక్కలు చేశాడు. పదిహేనేళ్ళకే గణితశాస్త్రంలో కొత్త "థీరమ్స్" సృష్టించాడు.

1903లో మద్రాసు విశ్వవిద్యాలయపు ఉపకార వేతనం లభించింది. కాని రామానుజన్ తన కాలమంతా లెక్కల్లో గడపటం వల్ల ఇంటర్ తప్పిపోవటంతో ఆ ఉపకార వేతనం పోయింది. ఇక చదువు సాగే మార్గంలేక ఓడల ఆఫీసులో చిన్న గుమస్తా ఉద్యోగం చేయసాగాడు. అయినా అతను తనకున్న లెక్కల అభిరుచిని తగ్గించుకోలేదు.

1913లో రామానుజన్ తనుప్రతిపాదించినకొత్తథీరమ్సను కేంబ్రిడ్జీ యూనివర్సిటీలో గణితాచార్యుడైన హార్డీకి పంపాడు. హార్డీ వాటిని చూశాడు. కాని వాటిని గురించి పెద్దగా పట్టించుకోలేదు.

కాని తరువాత మరో ప్రముఖ గణితశాస్త్రజ్ఞుడైన లిటిల్‌వుడ్ అనే అతన్ని పిలిచి రామానుజన్ పంపిన కొత్త థీరమ్స్, అతను

ప్రతిపాదించిన సూత్రాలు, వివరాలు అన్నీ క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు.

అవి అర్థము చేసుకొన్నకొద్దీ హార్డీకి రామానుజన్ గొప్ప మేధావి అని అతనిని తప్పక ఇంగ్లాండ్ పిలిపించాలని సంకల్పం కలిగింది.

1914లో రామానుజన్‌కు తగిన పద్ధతిలో విద్యాభ్యాసము జరిగి ఉండకపోవటంతో, అతనికి కొన్ని విషయాలు హార్డీ ప్రత్యేకంగా బోధించాడు. కొద్దికాలంలోనే రామానుజన్ ప్రతిభకు, మేధా సంపత్తికి హార్డీ ఆశ్చర్యపోయాడు. ఇద్దరూ కలిసి కొన్ని పరిశోధన వ్యాసాలు ప్రకటించారు.

రాయల్ సొసైటీ ఫెలోషిప్ ఇచ్చి రామానుజన్‌ను గౌరవించింది. అప్పటికి రామానుజన్ వయసు ముప్పయి ఏళ్ళు. అంత చిన్న వయసులో గణితశాస్త్రంలో గౌరవ ఫెలోషిప్ పొందిన వారు లేరు. ట్రినిటీ యూనివర్శిటీ కూడా ప్రప్రథమంగా ఒక భారతీయుడికి గౌరవ సభ్యత్వమిచ్చి ఆదరించింది.

రామానుజన్ తన ప్రతిభను అంత గొప్పగా ప్రదర్శించి ప్రపంచ మేధావుల నీరాజనాలందుకున్నా, అయన ఆరోగ్యం మాత్రం క్షీణించసాగింది. ఏ రోజూ రామానుజం తన ఆరోగ్య విషయంలో పెద్దగా పట్టించుకోలేదు. ఆయన ఆరోగ్యం పూర్తిగా క్షీణించిపోయి వ్యాధిగ్రస్తుడై రామానుజన్ ఆసుపత్రిలో ఉండవలసి వచ్చింది.

అప్పటికే రామానుజన్ ఆసుపత్రిలో అపస్మారక స్థితిలో నీరసంగా ఉన్నాడు. అతన్ని చూడటానికి హార్డీవెళ్ళి వచ్చిన టాక్సీ నెంబరు చెప్పి "అది మంచి సంఖ్యకాదేమో?" అన్నాడు.

కాని రామానుజన్ ఆ మాటను ఖండిస్తూ అది మంచి సంఖ్య అని చెప్పి ఎలాగో వివరిస్తూ నోటి లెక్కలా చెబుతూపోయాడు. అంత బలహీనస్థితిలోకూడా అంత గొప్పగా చురుగ్గా పనిచేస్తున్న అతని మేధస్సుకు ధన్యవాదాలు తెలుపుకున్నాడు హార్డీ. తరువాత 1920లో టి.బి.తో రామానుజన్ మద్రాసులో కీర్తిశేషుడయ్యాడు.

# హిట్లర్ నిర్మించిన "ప్రేమనగర్"

ప్రపంచ చరిత్రను ఘోరంగా ఒక్క మలుపుతిప్పి, చరిత్రలో గొప్ప నియంతగా శాశ్వతమైన దుష్కీర్తి పొందినవాడు, అడాల్ఫ్ హిట్లర్! ప్రపంచం మొత్తాన్ని ఒక్కవ్యక్తి అంత గడగడలాడించిన సందర్భము కూడా బహుశా "నభూతో నభవిష్యతి" అని చెప్పవచ్చు.

మొదటి ప్రపంచయుద్ధంలో చావుదెబ్బతిని, ఓడిపోయి, అన్ని రంగాల్లో పతనమై, చిక్కి శల్యమైపోయిన జర్మనీకి పాలకుడుగా హిట్లర్ అధికారంలోకి వచ్చాడు. అయితే అతని పాలనలో మళ్ళీ జర్మనీ పూర్వపు ఔన్నత్యాన్ని సాధించి, ప్రపంచంలో తిరుగులేని గొప్పదేశంగా పైకొచ్చింది. కాని అతని తెలివి తక్కువ ఆలోచనలు కొన్ని అతని పతనానికి ఎలా దారి తీశాయో తెలుసుకుంటే ఆశ్చర్యం వేస్తుంది.



అడాల్ఫ్ హిట్లర్ (1889-1945)

జర్మనీ దేశీయులంతా ఉత్తమజాతి ఆర్యులని, అసలైన తెలివి తేటలు వాళ్ళ సొత్తేనని హిట్లరు గట్టినమ్మకం! ఈ నమ్మకంతో, ప్రపంచ దేశాలన్నింటినీ జయించి పాలించి వేయాలనే పట్టుదల అతనిలో బలపడింది. ఇక ఆలస్యం చేయకుండా విశ్వామిత్రుడు ఎప్పుడో "సృష్టికి ప్రతిసృష్టి" చేసిన విధంగా—తను కొత్త జర్మను మేధావులను సృష్టించాలని పథకం వేశాడు.

ముందుగా, ఈ మేధావివర్గ సృష్టికి ఒక ప్రేమనగరే నిర్మిం చాడు. ఆ నగరంలో ప్రేమజంటలు వినోదిస్తూ క్రీడించటానికి వీలుండే విధంగా అందమైన ఉద్యానవనాలు, వసతైన భవంతులు, ఈతకొలనులు, ఫలహార భోజన శాలలు, వైద్య వినోద వసతులు ఏర్పాటు చేయించాడు.

పైన వర్ణించిన ప్రేమ నగరాల్లో విహరించటానికి, క్రీడిస్తూ వినోదించటానికి ఎన్నుకోబడే వారంతా, మంచి తెలివితేటల్తోపాటు, స్ఫురద్రూపులు అంగాంగం తీర్చిదిద్దినట్లుండే మన్మథాకారులు. వీళ్ళను కూడా బాగా పరిశోధించి, అనేక పరీక్షలుపెట్టి ప్రత్యేకంగా ఎన్నికైన వాళ్ళకే ఈ ప్రేమనగరులోకి జంటలుగా అనుమతించే వాడు హిట్లరు. ఇలాంటి ప్రత్యేక జర్మను తెగకోసం హిట్లరు చేస్తున్న పని ప్రపంచంలో ఎవరూ చేయలేనిది, అంత వరకు ఎవరూ చేయనిది కావటంతో 'ప్రేమనగర్' విషయంలో పనిచేసే ప్రత్యేక శాఖకు జర్మన్ ప్రజల సహాయ సహకారాలు ఎప్పుడూ వుండేవి.

హిట్లరు సైనిక నియంత కావటంవల్ల, సైనిక దళాలలోని ప్రధానాధికారుల్లో పైస్థాయి వాళ్ళకు, సహజంగా "ప్రేమనగరు"కు వెళ్ళే అవకాశం దక్కుతుండేది.

అమిత ధైర్యసాహసాలు ప్రదర్శించటానికి జర్మనీ సైనికులు పెట్టిందిపేరు. ముఖ్యంగా వాళ్ళు యుద్ధరంగంలో ప్రదర్శించే ప్రత్యేక ధైర్యసాహస కార్యక్రమాలను బట్టి, ప్రేమనగర్‌కు వాళ్ళు ఎంపిక అయ్యే ప్రత్యేక అర్హత వాళ్ళు సంపాదించుకునేవాళ్ళు, మంచి సంతానాన్ని ప్రసాదించాలి కాబట్టి, ఆ కార్యక్రమానికి ఎన్నుకోబడిన వారికి, మంచి పోషకాహారంతోపాటు, సెలవులు, అదనపు జీతభత్యాలు, ఇంక్రిమెంట్లు అదనపు ఆకర్షణగా ఉండేది.

పై ప్రేమనగరులో చోటు ఎలాగైనా సంపాదించాలని,

హిట్లరు మెప్పు పొందాలని, ప్రముఖ సైనికోద్యోగులంతా, ప్రాణాలకు తృణప్రాయంగా తెగించి యుద్ధాల్లో పాల్గొనేవారు. అదృష్టం బాగుండి కాలం ధర్మంకలిసివస్తే ప్రేమనగరు ఇంద్రభోగాలు అనుభవించవచ్చు!

ఈ ప్రేమనగరుకు వచ్చే వీరులకు విందులు వినోదాలతో పాటు, సుఖాలు ఇచ్చే యువతులు ఒక ప్రత్యేక పద్ధతిలో ఆయా వీరులతో జతపట్టేవాళ్ళు.

ప్రేమనగరుకు వచ్చిన యువకుడు తన అభిరుచి మేరకు, తనకు నచ్చిన యువతితో జతకట్టి క్రీడించి ఆనందించవచ్చు. అయితే ఆ యువతిని తప్ప ఆ ప్రేమనగరులోవున్న తక్కిన యువతులతో అతను ఎలాంటి సంబంధాలూ పెట్టుకోకూడదు.

# అసమానతలపై పోరాడిన అంబేద్కర్

సుమారు ఒక శతాబ్దం క్రితం జరిగిన సంఘటన, అది మందు వేసవి.

ఒక ఒంటెద్దు బండిలో ఇద్దరు చిన్నపిల్లలు, బొంబాయికి ప్రయాణమయ్యారు.



అంబేద్కర్
(1891–1956)

వాళ్ళు, బొంబాయిలో వున్న తమ తండ్రిని కలవాలనీ, బొంబాయికి సమీపంలో వున్న ఒక పల్లె నుంచి బయలుదేరారు.

కాని దారిలో, ఆ అన్నదమ్ముల మాటలనుబట్టి వాళ్ళు హరిజనులని, అంటరాని వాళ్ళని తెలిసింది.

అంతే !! కోపం పట్టలేక, వాళ్ళు హరిజనులని నిర్ధారణ చేసుకొని, పళ్ళు పటపట కొరుకుతూ "మీవల్ల నాబండే మలినమై పోయింది ! మీ వంటి హరిజనులకు తగిన బుద్ధి చెప్పాలి. ఇలాంటి పనులు మళ్ళీ జరగకుండా చూడాలి!" అంటూ అరుస్తూ, ఆ ఇద్దరు పిల్లలున్న బండిని పెంట కుప్ప దగ్గర దొర్లించినట్టు దొర్లించాడు బండివాడు.

అలా ఆ రోజు, ఆ ఘోరమైన అవమానానికి గురైనపిల్లల్లో ఒకతను, భారత జాతీయ సాంఘికోద్యమ చరిత్రలో ఉన్నత స్థానం వహిస్తున్న డాక్టర్ భీమారావ్ రాంజీ అంబేద్కర్ !

ఆ పిల్లలకష్టాలు అంతటితో తీరిపోలేదు. వాళ్ళుకాలినడకన ప్రయాణం చేస్తూ, దారిలో ఓ బావివద్ద, నీళ్లు త్రాగటానికి వెళ్ళి, అక్కడ నీళ్ళు తోడుకుంటున్న వాళ్ళను దాహం అడిగారు. దాహం అడగటానికి వచ్చిన పిల్లలిద్దరూ హరిజనులని తెలిసి, దాహం ఇవ్వక పోగా, మంచినీటి బావిని సమీపించటానికి వాళ్ళు చేసిన సాహసానికి

గొప్ప విస్మయం తెలియజేస్తూ కోపంతో మండిపడుతూ, ఆ సవర్ణులు వాళ్ళను తరిమివేశారు.

ఇక గుక్కెడు నీళ్ళు దొరకని పరిస్థితుల్లో ఆ ఇద్దరు సోదరులు, వుస్సురుమంటూ ప్రయాణం చేయాల్సివచ్చింది.

అంబేద్కర్ బాల్యం దుర్భర దారిద్ర్యంలో గడచింది. ఆయన తండ్రి బొంబాయిలో వుండగా ఒక మెట్లక్రిందున్న గదిలో వుండేవాడు. అదీ చాలీచాలక వుండేది. తండ్రీ కొడుకులు ఒకేసారి పడుకోడానికి ఏమాత్రం చాలేదికాదు.

అందుకు అంబేద్కర్ ఓ ఆలోచనచేసి, దాన్ని అమలు పరచాను. రాత్రి రెండింటివరకు అంబేద్కర్ నిద్రపోయేవాడు. అప్పటివరకు తండ్రి ఓ మూల కూర్చొని వుండేవాడు.

అర్ధరాత్రి రెండింటికి అంబేద్కర్ నిద్రలేచిచదువుకోడానికి కూర్చోగానే, ఆయన తండ్రి నిద్రకు ఉపక్రమించేవాడు. అలాబాధల్లో చదువు సాగిస్తున్న అంబేద్కర్, ఒకసారి కొంత డబ్బుతో ఇంటి నుంచి పారిపోయి, స్వతంత్ర జీవనం గడపాలని పథకం వేశాడు.

కటిక పేదవాడైన అంబేద్కర్ చిన్నప్పుడు మేకలను ఆవుల్ని కాచేవాడు. చదువుపట్ల అమితాసక్తి వున్నవాడు కావటంతో, తన మేనత్త రొంటిన దాచుకొన్న డబ్బు వుండితీరుతుందని అతని నమ్మకం. ఆ డబ్బు సంచి దొంగిలించి ఇంటినుంచి వెళ్ళిపోవాలని అతని పథకం

ఆ ఉద్దేశ్యంతో, అప్పటికి తొమ్మిదేళ్ళ వయసున్న అంబేద్కర్, మేనత్తతోపాటు క్రింద పడుకునేవాడు. రోజూ ఆ సంచి కాజేయాలని వరుసగా మూడు రాత్రులు ప్రయత్నించి చివరికెలాగో ఆ పనిలో నాలుగోరోజు కృతకృత్యుడయ్యాడు.

తీరా ఆ సంచిలో ఎంతవుందో చూస్తే అతని దుఃఖానికి అంతులేదు. అతను అంత ఆశతో సంపాదించిన ఆ సంచిలో... కేవలం అర్ధణామాత్రమే వుంది. అప్పటికిగాని అతని అర్ధంకాలేదు. తామెలాంటి ఘోర ఆర్థిక దుస్థితిలో వున్నారో ! ఇది ఇంటి పరిస్థితి. అలా అవమానాలు, అసమానతలు ఇంటా బయటా లెక్కలేనన్ని

ఆయన ఎదుర్కొన్నాడు. ఇలాంటి అవమానాలు బయట సర్వ సామాన్యమైపోయాయి.

ఇలాంటి దూషణ భూషణలు చాలా అంబేద్కర్‌కు పాఠశాలలోనూ కొత్తకాదు.

విద్యార్థులందరిలోకి తెలివిగలవాడైనా, అంబేద్కర్ ఎప్పుడూ క్లాసుచివర ఒక మూల బిక్కుబిక్కుమంటూ కూర్చోవాల్సి వచ్చేది.

తను హరిజనుడనైనంతమాత్రాన తనను అలా అవమానించటం ఘోరమని అంబేద్కర్ మనసులో బాధపడేవాడు.

ఒకరోజు అధ్యాపకుడు చెప్పగా, నల్లబల్లమీద ఏదో వ్రాయాలని బాల అంబేద్కర్ నల్లబల్ల దగ్గరకు వెళుతున్నాడు.

ఇంతలో పిల్లలంతా గోలగా, ఒక్కసారి, పిడుగు పడ్డట్టు అరిచారు.

వాళ్లు భోజనం తెచ్చుకున్న టిఫిన్లు ఆ బల్ల వెనకవుంచారు. బాల అంబేద్కర్ వాటిదగ్గరకు వెళుతుండటంవల్ల, వాళ్ళ తిండిమైల పడిపోతుందట. అది వాళ్ళకు తినటానికి పనికిరాదట.

ఆ సంఘటన అంబేద్కర్ జీవిత దృక్పథాన్నే మార్చివేసింది. ఎన్ని అవమానాలు భరించి అయినా తను దళితులు, అంటరానివారికోసం పోరాటం సాగించాలనే ధృఢ నిర్ణయానికొచ్చాడు.

1917లో అంబేద్కర్ మొదట డాక్టరేట్ తీసుకున్నాడు. తరువాత అధ్యాపకుడుగా పనిచేసి కొంత డబ్బు సంపాదించి, 1920లో లండన్ వెళ్ళి, అక్కడ అర్థికశాస్త్రంలో డాక్టరేట్ తీసుకున్నాడు. 1828లో బారిష్టర్ పట్టాతీసుకుని హైకోర్టులో న్యాయవాదిగా ప్రాక్టీసు చేయాలనుకున్నాడు. కాని ఏ సీనియర్ లాయర్ కూడా అంటరానివాడైన అంబేద్కరును తమ దగ్గరకు చేరనివ్వలేదు. అన్ని ఉన్నత విద్యార్హతలున్నా మళ్ళీ అంటరానితనం అడ్డొచ్చింది. ఆయన జీవితమే అలా నిత్యపోరాట చరిత్ర అయిపోయింది.

8)

## రచన - ఆచరణ - ఒక్కటేనన్న శరత్


శరత్ చంద్రుడు

"రచన వేరు ఆచరణ వేరు"-అన టంచేతే, రచయితలకు సంఘంలో విలువ లేకుండా పోయిందంటారు కొందరు.

అయితే రచనలో ఎంత దయార్ద్రత వుందో ఆయన నిజజీవితంలోనూ అంతే దయార్ద్రత వుందనటానికి మంచి ఉదాహరణ—బెంగాలీ రచయిత, శరత్ చంద్రుడు!

శరత్ అప్పుడు రంగూన్‌లో ఒక ప్లీడరు గుమస్తాగా కటిక పేదరికంలో మగ్గుతున్నాడు. జీతం తక్కువలో వుండటంచేత, రంగూన్‌లో పనిచేసే బెంగాలీ గుమస్తాలు పెట్టుకున్న ఒక మెస్‌లో శరత్ కూడా భోజనం చేస్తుండేవాడు.

శరత్ అద్దెకుంటూన్న ఓ మేడ క్రిందిభాగంలో చక్రవర్తి అనే ఒక బెంగాలీ బ్రాహ్మణ మెకానిక్ ఉండేవాడు ఆయనకొక కూతురుండేది. ఆ అమ్మాయికి యుక్తవయసు వచ్చినా, తల్లి లేని కారణం చేత తండ్రి ఆమె పెళ్ళికి పెద్దగా శ్రద్ధచూపలేదు. పైగా అతను తాగుబోతు. రోజూ రాత్రి తన యింట్లోనే పేకాట, త్రాగుడు తన మిత్రులకు, తనతోపాటు తనింట్లోనే ఏర్పాటు చేసుకునేవాడు.

రోజూ కూతురినే వాళ్ళందరికీ కావలసిన అనుపానాలు అందించమని, ఆ మెకానిక్ నిర్బంధించేవాడు. త్రాగి రోజూ కూతురుని కొట్టడం, తిట్టడం చేసేవాడు.

ఒకరోజు శరత్ ఎక్కడికో వెళ్ళి తిరిగివచ్చేప్పటికి ఆమెకానిక్ కుమార్తె, శరత్ చంద్రుడి గదిలోకిదూరి, గడియ వేసుకుని, ఏడుస్తోంది.

శరత్ చంద్రుడొచ్చిచూచి తలుపుతట్టి "ఎవరునువ్వు!ఎందుకలా ఏడుస్తున్నావ్ ?" అంటూ ఓదారుస్తూ, అభిమానంగా అడిగాడు.

భయంతో వణికిపోతున్న ఆ అమ్మాయి "మానాన్న త్రాగుబోతు మీకు తెలుసుగదా ! ఆయన నన్నొక వృద్ధుడికి కట్టబెట్టాలని ఆయన దగ్గర కొంత డబ్బు కూడా తీసుకున్నాడు ! ఆయన త్రాగివచ్చి నన్ను ఆ వృద్ధుడికి అప్పగించాలని ప్రయత్నించే సరికి-ప్రాణరక్షణకోసం ఇలావచ్చి దాక్కున్నాను!" అంటూ ఏడుస్తూ, చెప్పింది.

ఆ మాటలుచెప్పి ఆ యువతి శరత్‌చంద్రుడి కాళ్ళమీదపడి ఏడ్వసాగింది.

శరత్‌చంద్రుడికి ఆమెపట్ల ఎంతో జాలి కలిగి ఆమెను ఆ రాత్రికి అక్కడే ఉండమని, రెండోరోజు ఉదయమే ఆమె తండ్రితో మాట్లాడాడు, ఆ తండ్రి కట్టబెట్టాలని చూస్తున్న ఆ వృద్ధుడు ఆ యువతికి తగిన వరుడుకాదని, ఆమెను తగిన యువకునికి ఇచ్చి చేయమని చెప్పాడు.

అయితే ఆ త్రాగుబోతు శరత్ మాటలను లెక్కచేయక "మా అమ్మాయికి తగిన వరుడు అంతకంటే నాకెక్కడా కన్పించలేదు! అంత నీతులు చెప్పేవాడివి నువ్వే చేసుకోవచ్చుగా ! నువ్వు ఇష్టపడితే ఈ క్షణాల్లో వివాహం చేస్తాను !" అన్నాడు, అరుస్తూ.

శరత్ చంద్రుడు కొద్దిసేపు ఆలోచించి, ఆ యువతి పరిస్థితిని అర్థం చేసుకొని, ఆమెమీద జాలితో ఆమెనే వివాహమాడాడు ! అలా శరత్‌చంద్రుడి జీవితం ఆనందదాయకంగా గడిచింది. ఆదంపతులకు ఒక కుమారుడు కలిగాడు. శరత్‌చంద్రుడు పుత్రోత్సాహంలో వుండగా ఒక విపత్తు సంభవించింది. రంగూన్‌లో అనుకోకుండా మళ్ళీ విజృంభించిన ప్లేగువ్యాధి, శరత్-భార్యను, కుమారుణ్ణి పొట్టన పెట్టుకుంది. వాళ్ళ మరణంవల్ల ఆయనెంతో కృంగిపోయాడు.

# విద్యాదాన కర్ణుడు మాలవ్యా

భారతదేశ చరిత్రలో మరే నాయకుడూ ఇవ్వనంత ప్రాధా న్యత విద్యావ్యాప్తికి ఇచ్చినవాడు, పండిత మదన మోహన్ మాలవ్యా.



మదనమోహన్ మాలవ్యా

ఆయన తండ్రి గొప్పసంస్కృత పండితుడు. "పండిత బ్రిజ్‌నాథ్" అంటే అప్పట్లో ఆ చుట్టుపక్కల ప్రాంతాల్లో ఉండేగౌరవం, ఆయన కుమారుడైన మదనమోహనుడికి లభించేది. అయితే పేదవాడు కావటంవల్ల మదనమోహనుడుతన విద్యను పెద్దగా సాగించే వీలులేక [1884] ఒక అధ్యాపకుడిగానే జీవనం సాగించ వలసివచ్చింది. అప్పటికే గొప్ప జాతీయవాదిగా, ప్రముఖ వక్తగా, పత్రికా సంపాద కుడిగా, బహుభాషా పండితుడిగా మాలవ్యాకు ఎనలేని గౌరవం లభిం చింది.

ఒకసారి మాలవ్యా రచనలను చదివి ముగ్ధుడైన ఒక సంస్థా నాధీశుడైన రాజు, తను నడుపుతున్న "హిందుస్థాన్" అనే పత్రి కకు సంపాదకత్వం వహించి పనిచేస్తే, నెలకు రెండు వందల జీతం ఇస్తాననన్నాడు. అప్పటికి మాలవ్యా అధ్యాపకుడుగా, అరవై రూపా యల జీతంతో ఉన్నాడు. అయితే త్రాగుడు అలవాటున్న రాజావారు, ఆయన త్రాగి ఉండగా ఎప్పుడూ తనను పిలువనంపకూడదని

నియమం పాటిస్తే మాలవ్యా, ఆయన పత్రికకు సంపాదకుడుగా పని చేయటానికి ఒప్పుకున్నాడు.

అయితే ఒకసారి ఆ సంస్థానాధీశుడు తాగివుండి మాలవ్యాను పిలిపించటంతో వెంటనే ఆయన తన పదవికి రాజీనామా చేసేశాడు. తరువాత స్వయాన ఆ సంస్థానాదీశుడు క్షమాపణ చెప్పినా వినలేదు. "మాటంటే మాటే-అందుకు కట్టుబడి వుంటాను! అలా మాటకు కట్టుబడి వుండని వాళ్ళ దగ్గర పనిచేయను!" అన్నాడు మాలవ్యా.

తరువాత మాలవ్యా 1861లో, లా పరీక్ష పాసయి, న్యాయవాదిగా వృత్తి ప్రారంభించాడు. జాతీయోద్యమంలోచేరి ప్రముఖ నాయకుడై 1909లో, లాహోర్ కాంగ్రెసు సభలకు అధ్యక్షుడు అయ్యాడు.

1916లో భారతీయులకోసం బెనారస్ హిందూయూనివర్సిటీని మాలవ్యా స్థాపించాడు. దీనితో ఆయన కష్టాలు ప్రారంభమయ్యాయి. లక్ష రూపాయలు చందాలుగా వసూలు చేస్తేనేగాని, యూనివర్సిటీ నిర్మాణం ఒక రూపానికిరాదు.

అందుకని ఆయనే స్వయంగా ఊళ్ళు తిరుగుతూ, తనసహచరులతో కలసి, స్వయంగా జోలెలుపట్టి డబ్బులు వసూలు చేసేవాడు. ఆయన ఆశించిన మొత్తం ఆ రోజు వసూలుకాకపోతే, ఆ రోజు ఆయన కటిక ఉపవాసం చేసేవాడు.

ఒకసారి ఆయన ఒక కోటీశ్వరుడైన నవాబు దగ్గరికెళ్ళి, బెనారస్ యూనివర్సిటీకోసం సాయం అర్థించాడు. పిల్లికి బిచ్చంపెట్టని నవాబుగారు, తనవద్ద డబ్బులేదంటూ దండకం మొదలు పెట్టాడు. అయినా మాలవ్యా ఆయనను వదలకుండా. తన భుజం మీది అంగవస్త్రముతీసి, "మీకు తోచింది ఇప్పించండి ! మీరేం ఇచ్చినా సంతోషంగా స్వీకరిస్తాను!" అన్నాడు వినయపూర్వకంగా.

నవాబుగారికి కోపం వచ్చి "ఇదిగో ప్రస్తుతానికి ఇదేవుంది!" అంటూ, తన కాలిబాటుతీసి, ఆయన జోలెలోనే వేశాడు.

మాలవ్యా "మహాప్రసాదం!"అన్నట్టు నమస్కరించిఅక్కడ నుంచి నిష్క్రమించాడు. మాలవ్యాకు తగిన శాస్తి జరిగిందని నవాబు గారు, లోలోపల సంతోషించాడు.

ఇంతలో మరునటిరోజు, ఫలానా నవాబుగారి బూటు బహిరం గంగా వేలం వేయబడుతుందని పత్రికల్లో మాలవ్యా ప్రకటించాడు.

ఆ ప్రకటన చూసిన నవాబుగారు కంగారుపడి, వెంటనే తన మనుషులతో పెద్దమొత్తాన్ని తన వంతు చందాగా పంపి, తిరిగి తన బూటు తెప్పించుకున్నాడు. తన పథకంపారి, నవాబుగారు అలా దిగి వచ్చినందుకు అందరితోపాటు మాలవ్యా కూడా సంతోషించాడు.

బెనారస్ యూనివర్సిటీ అభివృద్ధిపట్ల ఆయనకు ఎంతమక్కు వంటే-ప్రముఖ జాతీయవాది, అకళంక దేశభక్తుడైన ఆయన అందరు జాతీయ నాయకులను ఎదిరించే ఓ చర్య చేశారు.

1921లో, ప్రిన్సుఆఫ్‌వేల్స్‌ని అందరూ బహిష్కరిస్తుంటే మాలవ్యా ఆయనను హిందూ యూనివర్సిటీకి ఆహ్వానించారు. జాతీ యోద్యమంలో చేరటానికి విద్యార్థులు తమ చదువులను సైతం వదలి వేయాలని గాంధిజీ వంటి జాతీయ నాయకులు చెప్పినా, ఆయన విద్యార్థులు చదువు మానుకోవటం తగదని చెప్పినాడు.

# ఉత్తమ కళాకారుడైన చాప్లిన్



చార్లెస్ చాప్లిన్
**(1889-1977)**

"నటన జన్మతా వస్తుందా-లేక సాధనతో నటనను నేర్చుకోవచ్చా" అనేది, కొందరు నటులవిషయంలో తేల్చిచెప్పటం కష్టం.

పురుషుల్లో పుణ్యపురుషులు వేరుగా వుంటారన్నట్టు, నటుల్లో మహానటులు అరుదుగా వుంటారు.

అలాంటి అరుదైన అంతర్జాతీయ నటుడు చార్లీచాప్లిన్ ప్రపంచ సినిమా చరిత్ర వ్రాయటానికికూర్చుంటే-అది"మూకీ" సినిమా చరిత్రయినా - "టాకీ" సినిమా చరిత్రయినా, ముందు వరసలో వుండే మహామహుల పేర్లలో, చార్లీ చాప్లిన్ పేరు ముందుంటుంది.

చార్లీ చాప్లిన్ అసలు పేరు ఛార్లెస్ స్పెన్సర్ ఛాప్లిన్ 1889 ఏప్రిల్ పదహారున లండన్‌లో పుట్టిన చాప్లిన్ తల్లీ తండ్రి ఇద్దరూ కాళాకారులే. వాళ్ళిద్దరూ ఎన్నో క్లబ్బుల్లో పాటలు పాడుతూ, జీవనోపాధి సంపాదించుకుంటుండేవాళ్ళు. వాళ్ళ ఆదాయం అంతంత మాత్రంగా ఉండటంతో, కుటుంబం గడవక బాధపడుతుంటే చార్లీ చాప్లిన్ తండ్రి తాగుడు వ్యసనానికి బానిస అవటంచేత ఆ కాస్త ఆదాయం ఆయనకే సరిపోయేదికాదు.

మరోమార్గంలేక చాప్లిన్‌తోపాటు అతని తమ్ముడూ స్కూలు మాని వేయవలసి వచ్చింది. అప్పుడు చాప్లిన్ చదువుతున్నది రెండవ తరగతి. అంతే! జీవనపోరాటంలో పడ్డ చాప్లిన్‌కు మళ్ళీ చదువుకునే అవకాశం కలగలేదు. జగమనే నాటకరంగమే, ఆయన పాఠశాల అయ్యింది.

కుటుంబపోషణ కోసం చాప్లిన్ తల్లి తన శక్తికి మించి పని చేసింది. దీనితో అనారోగ్యం, తరువాత ఆమెకు పాటలు పాడటానికి ముఖ్య జీవనాధారమైన ఆమె గొంతు మూగపోయాయి. దీనితో పిల్లలు తిండిలేక మలమలమాడే స్థితివచ్చింది.

తరువాత చాప్లిన్ తల్లికి మతి చలించటంతో, ఆమెను పిచ్చాసుపత్రిలో చేర్చారు. అనాధలై తిండికిలేని చాప్లిన్, తన సోదరుడితో కలసి, ఎవరో ఉదారులు సాయం చేయగా, అనాధాశ్రమంలో చేరాడు.

అక్కడ బక్కపీచుగా, దుర్బలాకారంలోవున్న చాప్లిన్‌సోదరులను చూసి, తక్కిన పిల్లలు "మూగదాని పిల్లలు అంటూ ఆటలు పట్టిస్తూ నవ్వేవాళ్ళు.

అలా, అందరి నవ్వుకూ, ఎగతాళికి గురైన చాప్లిన్ ప్రపంచాన్ని చూసి సగర్వంగా నవ్వుతూ, మనుషుల బలహీనతల్ని చూసి నవ్వించేస్థితికి ఎలా ఎదిగాడో తెలుసుకుంటే, ఆశ్చర్యంగా ఉంటుంది.

అనాధాశ్రమం నుంచి బయటపడ్డ చాప్లిను, ఓడరేవులకుచేరి, అక్కడ జీవన భృతికోసం కృషిచేశాడు. అక్కడ పనిదొరికినప్పుడు తిని లేనప్పుడు రోడ్లమీద ముష్టెత్తి జీవనోపాధి సాగించాడు. ఒక్కోసారి కేవలం పచ్చి మంచినీళ్ళతో పస్తులుండవలసి వచ్చేది.

అలా ఉండగా, అతని అదృష్టవశాత్తు ఒక డ్రామాట్రూపులో చిన్న పోర్షను దొరికింది. అక్కడ ఆదాయం అంతంత మాత్రంగా ఉండేది. ఒకసారి ఇంగ్లండ్‌లోని, మాక్ సిక్నిఛ్ బృందం వాళ్ళు, ఒక హాస్యపాత్ర నటించే అవకాశం చాప్లిన్‌కు ఇచ్చారు. అలాటి అవకాశం చాప్లిన్‌కు రావటం అదే మొదటిసారి. వాళ్ళు హాస్య పాత్రకు అనుగుణమైన ఆ హాస్యం సమకూర్చుకునే పనీ, చాప్లినుకే ఇచ్చారు.

చాప్లిను వెంటనే వదులుగా ఉండే పొడుగు పంట్లాము, పెద్ద బూట్లు, వంకిబెత్తంకర్ర, డెర్బీటోపీ, చిన్న గుబురు మీసంతో, ముక్కు అటూ ఇటూ తిప్పుతూ కొత్తరకం వేషంలో సిద్ధమయ్యాడు.

"ఏమిటయ్యా! ఇదేం డ్రస్సు? ఇదేం వాలకం?" అంటూ, అడిగాడు, నాటక కంపెనీ యజమాని.

"ఈ కోటులోనే ఉన్నాయి కోటికశారూపాలు. ఈ వాలకం లోనే దేశదిమ్మరి ఉన్నాడు, కవి, స్వాప్నికవిహారి, ఏకాంతాభిలాషి, ప్రేమ, సహచర్యంకోరే వ్యక్తి ఉన్నాడు!" అంటూ సమాధానం చెప్పాడు చాప్లిను.

చింకికోటు, చిరిగిన బూట్లు,సూటిగా లేక ప్రక్కప్రక్కలకు పోదాలు పడే కాళ్లు, చౌకటోపీ, తేలిగ్గా తిప్పుకునే బెత్తం, ఇవన్నీ మెత్తటి మనిషికి, మానవతకు, నిదర్శనాలైనాయి.

క్రమేపి, ఆ వేషాన్ని ప్రపంచం మొత్తం అంగీకరించే స్థాయికి చాప్లిను తీసుకెళ్ళాడు.

1913లో, ఫ్రెడ్‌కార్నో కంపెనీ, అమెరికాలో చాప్లిను నాటక ప్రదర్శనలు ఏర్పాటు చేసింది. అక్కడ చాప్లిను ప్రదర్శన

లను ప్రేక్షకులు అమితంగా ఆదరించటంతో చాప్లినుకు, హాలీవుడ్ అవకాశాలు వచ్చాయి.

చాప్లిను నటించిన మొదటి సినిమా "మేక్ ఎ లివింగ్" అనేది అది బాగా ప్రజాదరణ పొందటంతో ఇక సినిమా నిర్మాతలు అతని ఇంటిముందు క్యూలో బారులు తీరారు.

సినిమాల్లో మొదట వారానికి ఏభై డాలర్లతో ప్రారంభించిన చాప్లిను, రెండవఏడు వచ్చేసరికి, పదివేల డాలర్ల పారితోషికం తీసు కునే స్థాయికి ఎదిగాడు.

తరువాత చాప్లిను డైరెక్టరుగా, నిర్మాతగా మారి, తనే స్వంత కథలు సమకూర్చుకుని, తనే నటిస్తూ సినిమాలు తీశాడు.

టాకీ యుగం వచ్చిన తరువాతకూడ,చాప్లిను,నిశ్శబ్ద చిత్రం (మూకీ) "సిటీలైట్స్" తీశాడు. అయితే, అమెరికాలోని పెద్ద థియే టర్ల వాళ్ళు చాలా పెద్ద మొత్తాలు అద్దెలు పెంచి, చాప్లిను చిత్రాల ప్రదర్శనను ఆపాలనుకున్నారు. చాప్లిను వాళ్ళుకోరిన అద్దె ఇచ్చాడు అయినా అతని చిత్రాలకు ఊహించటానికి కూడా వీలులేనంత లాభాలు, పెద్ద మొత్తంలో వచ్చిపడ్డాయి.

"జీవితపు మాధుర్యమంతా అందులోని సంఘర్షణలోనూ బాధలోనూ ఉంది ! నేను సృష్టించిన హాస్య మంతటికీ ప్రాతిపదిక అదే!" అంటాడు చాప్లిను.

పాత్రలను గమ్మత్తయిన చిక్కుల్లో ఇరికించి వారిని ఆ గమ్మత్తయిన చిక్కుల నుంచి మరీ గమ్మత్తుగా బైటపడవేయటమే_ హాస్య సృష్టికోసం చాప్లిను అవలంభించిన విధానం.

చాప్లిను కోటికి పడగెత్తాక, తన స్వీయ చరిత్ర వ్రాసు కున్నాడు.

అందులో ఆయన నేను కార్మికుణ్ణి; సామాన్య మానవుణ్ణి.

శాంతివాదిని; నేను యుద్ధవ్యతిరేకిని; ప్రపంచ పౌరుణ్ణి; నా చిత్రా లలో ఎప్పుడూ కారుణ్యమే కనిపిస్తుంది!" అంటూ, చెప్పుకున్నాడు;

చాప్లిను సినిమాల్లో సమకాలిక గాథలూ, బాధలూ, సామాన్యుడి జీవితానికి దర్పణం పడుతూ కనిపిస్తాయి.

నటనలో తాదాత్మ్యతచెంది నటించటం చాప్లినుకుఅలవాటు. అతని హాస్యం వెనుక కరుణరసం వుంది. "ది గ్రేట్ డిక్టేటర్" అతను తీసిన మొదటి టాకీ చిత్రం. కథ సాఫీగా ఉండటం అనే దానికి చాప్లిను ప్రాధాన్యత ఎప్పుడూ ఇచ్చేవాడు. "కెమేరా"ద్వారా చెప్పదలచుకున్నది ఎంత హాస్యంగా, ఎంత వ్యంగ్యంగా, ఎంత సింపుల్‌గా తీయటమనే దానికే, ఆయన ప్రాధాన్యత ఇద్చాడు.

కథలో నూతనత్వం కోసం చాప్లిను తన సినిమాల్లో కృషి చేశాడు.

"కిడ్"లో కిటికీలకు అద్దాలువేసేపని, ఇళ్ళముందు మంచు ఊడ్చేపని చిత్రిస్తే "సర్కస్" అనే సినిమాలో సర్కస్ పనులు చేసే విఫల ప్రయత్నం చిత్రితం! "మోడరను టైమ్స్"లో చాప్లిను ఫ్యాక్టరీ కూలీగా కనిపిస్తాడు. "గ్రేట్ డిక్టేటర్"లో క్షురకర్మ చేసే వ్యక్తిగా దర్శనమిస్తాడు.

"సిటీలైట్సు" చిత్రంలో చాప్లినుపాత్ర, అతను ప్రేమించిన యువతికి కంటి చూపు ప్రసాదించటానికి, డబ్బు కోసం సైకిల్ దొంగ తనంచేసి జైలుకు వెళతాడు. అలా ఒక అనామకుడుగా, పేదవాడుగా జీవితం ప్రారంభించిన చాప్లిను ప్రపంచ ప్రసిద్ధ ఉత్తమ కళాకారుడూ కోటీశ్వరుడూ అయ్యాడు.

## తెల్లవారిని గడగడలాడించిన యువకిషోరం

# సుభాస్ చంద్రబోస్

రెండు వందల ఏళ్ళ పైబడి బ్రిటీషు వాళ్ళు భారతదేశాన్ని పాలిస్తే, భారతదేశంలోని ముప్పయికోట్ల మందిలో వాళ్ళు ఒకేవ్యక్తిని చూసి బెంబేలెత్తిపోయారు! ఆయన పేరు చెబితే వాళ్ళకు భయంతో వళ్ళు చెమటలు పట్టేది ఆ మహావ్యక్తే సుభాస్‌చంద్రబోస్!



సుభాస్ చంద్రబోస్

**(1897–1944)**

బ్రిటీష్ వాళ్ళను ముప్ప తిప్పలు పెట్టి మూడు వేల చెరువుల నీరు త్రాగించిన ఏకైక వ్యక్తి బోస్! ఆయన ఉన్నత పోలీసు అధికారులకు దొరికినట్టే దొరికి, క్షణంలో మంత్రించినట్టు మాయమయ్యేవాడు. ఆయన జీవితమంతా ఒక గొప్ప సాహసగాథ.

అప్పటికే బోస్‌ను అరెస్టు చేయమని పోలీసు ఉన్నతాధికారులకు, రహస్య తాకీదులున్నయ్. ఆ పని మీదే రాయ్ అనే పోలీసు ఇనస్పెక్టర్ మారువేషంలో, బోస్ కోసం పిల్లిలా పొంచి తిరుగుతున్నాడు.

కలకత్తాలో బోసు నివసించే వీధిలో ఇనస్పెక్టర్ రాయ్ బోసు కోసం వేచివుండగా, ఓ ఆజానుబాహుడైన గడ్డపు పఠాను, ఒక సందులోకి వెళుతూ కనిపించాడు.

ఇన్‌స్పెక్టర్ రాయ్ అతనిని ఆపి అతనిని పరికించి చూస్తు న్నాడు. ఆ పఠాన్‌కు కోపం వచ్చి "తప్పుకో!" అంటూ, అరచి అక్కడ నుంచి గబగబా వెళ్ళిపోయాడు.

పఠానులకు కోపం ముక్కుమీదే వుంటుందని తెలిసిన ఇన్‌స్పెక్టర్ రాయ్, ఆ పఠానుతో మరోమాట మాట్లాడలేకపోయాడు. ఇన్‌స్పెక్టర్ అలాగే చూస్తూ నిలబడ్డాడు. ఆ పఠాను ఒక ఇంటి దగ్గర తలుపు తట్టాడు.

తలుపు తెరచుకుంది. లోపలివారు ఈ పఠానును గదిలోకి ఆహ్వానించాడు. ఆ ఇద్దరూ బెంగాలీవాళ్ళు. ఈ పఠాను ఏదో సంభా షించు కున్నారు.

ఇన్‌స్పెక్టర్ అనుమానం తొలగిపోయింది. ఆ పఠాను-తను అరెస్టుచేయటానికి వెతుకుతూ తిరుగుతున్న బోస్ కాదని!! అయినా కాసేపు ఇన్‌స్పెక్టరు అక్కడే వున్నాడు.

ఇప్పుడు ఆ యింటి నుంచి తెల్లటి గడ్డంతో ఒక మౌల్వి బయటకు వచ్చాడు. మౌల్విగారు, ఆ యువకుడు, ఉర్దూ మాతృ భాషంత ధారాళంగా మాట్లాడుకుంటున్నారు. ఆ ఇద్దరూ అలా మాట్లాడుకుంటూ వెళుతుంటే— ఇన్‌స్పెక్టర్ చూస్తు నిలబడ్డాడు. అతను ఎంతో జాగ్రత్తగా వలపన్నినా బోస్ మాత్రం అతనికి చిక్కటంలేదు.

కాని—మొదట కాబూలీవాలాగా—తరువాత మౌల్విగా— రెండు రకాల దుస్తుల్లో—రెండు రకాల భాషల్లో మాట్లాడినవాడు— సుభాస్ చంద్రబోసే!

**1941**కి ముందునుంచే బోస్‌ను అరెస్ట్‌చేయటానికి, బ్రిటిష్ ప్రభుత్వం పోలీసు అధికారులకు, గూఢచారుల్లో ప్రధానాధికారులకు ప్రత్యేకంగా అనుమతించింది.

ఒకసారి—జనవరి ఖరవై అరున స్వాతంత్ర్య దినోత్సవం

కలకత్తాలో జరపాలని సుభాష్‌చంద్రబోస్, ఆయన అనుయాయులు నిర్ణయించినట్టు గూఢాచారులకు సమాచారం అందింది.

తెల్లవారితే ఆ కార్యక్రమంలో తప్పక పాల్గొంటానికి బోస్ తప్పకుండా వస్తాడని రాయ్ అనే పోలీస్ అధికారి, అవసరమైతే ఆయనను పారిపోనీయకుండా, కాల్చటానికైనా వెనుకాడ కూడదని రంగం సిద్ధం చేసుకున్నాడు.

బోస్, ఇన్‌స్పెక్టర్ రాయ్ వూహించినట్టే మారు వేషంలో వచ్చాడు. బోస్ ఇంటి పరిసరాల్లో తిరుగుతున్న అతనికి పఠాను యువకుడిమీద అనుమానం వచ్చి మొదట్లో వచ్చి పలకరించాడు.

అయితే బోస్ తొలగ కుండా "మా ఆవిడ తీవ్రవ్యాధితో బాధపడుతోంది? ఆమెకేదో నొప్పితగ్గే మందుకోసం బయలుదేరాను! దారిలో మీరు నన్ను ఇలా యిబ్బంది పెట్టడం భావ్యంగా లేదు!" అన్నాడు, ఎంతో బాధను అభినయిస్తూ బెంగాలీలో.

అంతే! ఇన్‌స్పెక్టర్ దూరంగా తొలిగాడు.

అతని మాటలు నమ్మాడు.

ఆ రోజు బోస్ ఆ విధంగా ఇన్‌స్పెక్టర్ రాయ్‌నుమోసంచేయ గలిగాడు.

ఢిల్లీ రైల్వేస్టేషనులో మౌల్వీ దుస్తుల్లో, తెల్లటిగడ్డంతో,కర్ర నేలను తాటిస్తూ ట్రెయినును ఎక్కుతున్న బోస్‌ను ఎవరూగుర్తుపట్టడం కాని, అనుమానించటం కాని, చేయలేకపోయారు.

పై సంఘటన జరిగిన మూడు రోజులకు బోస్ ప్రయాణం చేస్తున్న కంపార్ట్‌మెంట్‌లో మారు వేషంలో ఇన్‌స్పెక్టర్ రాయ్ ప్రయాణం చేస్తున్నాడు. బోస్‌కు అనుమానం రాకుండా వుండాలని, రాయ్ ఏమీ ఎరగనట్టు నటించసాగారు. బోస్ ఆ విషయం గమనించాడు.

ఒక స్టేషనులో టీ త్రాగటానికి ఇన్‌స్పెక్టర్ దిగినట్టుదిగాడు, లాహోరులో ట్రయిను ఆగగానే బోస్‌ను అరెస్టుచేయమని, అతను ట్రయినులోని ఏ పెట్టెనుంచి ఏ విధంగా మౌల్వీ దుస్తుల్లో దిగుతాడో చెప్పాడు, ఇన్‌స్పెక్టర్.

అయితే ఇన్‌స్పెక్టర్ ఎత్తులుముందే పసిగట్టిన బోస్‌ట్రయిన్ లాహోరు చేరకమునుపే, ముఘల్‌పురా స్టేషనులో దిగాడు. రాయ్ బోస్‌తోపాటు తనూ ట్రయినుదిగి ఆయనను అనుసరించాడు.

బోస్‌వెళ్ళి ఒక హోటల్‌లోని గదిలో దిగాడు, రాయ్ బోస్ కోసం ఎదురుచూస్తూ హోటల్ రిసెప్షన్ కౌంటర్‌దగ్గరకూర్చున్నాడు.

ఇంతలో ఓ ఫ్రెంచి వ్యక్తి దర్జాగావచ్చి అక్కడున్న ఒక కారులో వెళ్ళిపోయాడు. బోస్ తప్పించుకున్నాడని తెలియగానే ఫ్రెంచి దుస్తుల్లోఉన్న బోస్ వివరాలుచెప్పి ఆయనను అరెస్టు చేయమన్నాడు. గూఢచారులు ఆ కారుకోసం వెతికివెతికి వేసారిపోయారు. స్టేషనులో ఒక ఫ్రెంచివ్యక్తిని అడిగారు బోస్ వివరాలు. అతను తనకు తెలియదన్నాడు హతాశులైన గూఢచారులు ఉసూరుమంటూ వెళ్ళిపోయారు. తరువాత తెలిసింది, ఆ ఫ్రెంచి వ్యక్తే—బోస్ అని.

ఈ సంఘటన జరిగిన తరువాత బ్రిటిష్ ప్రభుత్వం,బోస్‌ను పట్టిన వాళ్ళకు పెద్ద మొత్తంలో డబ్బును ఎరగా "బహుమతి" అంటూ ఆశపెట్టింది.

ఏ మారువేషంలో వున్నా బోస్‌ను కనిపెట్టగల ఇన్‌స్పెక్టర్ రాయ్, తనే స్వయంగా ఈ పనికి మరింత గట్టిగా పూనుకున్నాడు.

మొఘల్ పురాలో, తన చేతిలోనుంచి తప్పించుకుపోయిన బోస్‌కోసం అతనిప్పుడు పెషావర్ నగరంలో మకాంవేశాడు. అక్కడికి బోస్ తప్పకవస్తాడని అతనికి తెలుసు, ఒకరోజు అతను ఆశించి నట్టే పఠాను దుస్తుల్లో వున్న వ్యక్తిని చూస్తే అతనికి అనుమానం

కలిగింది. అతను ఆ పఠానును వెంబడించసాగాడు ప్రమాదం పసి గట్టిన బోస్ పరిగెత్తివెళ్ళి ఒక విమానచోదక దళాధిపతి ఇంటిలోని పెద్ద చెట్టువెనక దాక్కున్నాడు. అది రాత్రిసమయం. అంతాచీకటి.

రాయ్, బోస్‌కోసం ఆ ప్రాంతమంతా గాలిస్తూ ఆ ఇంటి యజమానైన విమానచోదక దళాధిపతి ఇంటిని వెతికాడు. తనఇంట్లోకి ఎవరూ రాలేదని అ దళాధిపతి చెప్పాడు.

తరువాత రాయ్ వెళ్ళిపోగానే "మిస్టర్ బోస్! మీరిక ఆ చెట్టు చాటునుంచి బయటికి రావచ్చు!" అన్నాడు మెల్లిగా.

బోస్‌కు ఆశ్చర్యం వేసింది. తన పేరు ఆ పైలెట్ అధికారికి తెలిసినందుకు! తరువాత తెలిసింది అ అధికారి ఒకసారి వరదల్లో పడి మునిగిపోతూ, ప్రాణాపాయస్థితిలో ఉండగా, తాను అతనిని రక్షించినట్టు. ఆ కృతజ్ఞతా భావంతో ఇప్పుడు తను, తన ప్రాణం కాపాడాడు.

తరువాత ఈ పైలెట్ అధికారే, బోస్ ఇండియా నుంచి కాబూలుకు సురక్షితంగా చేరటంలో సాయంచేశాడు. బోస్ దేశం నుంచి తప్పించుకొని మెల్లిగా జపాను చేరటంతో, బ్రిటిష్ ప్రభుత్వం గడగడ లాడిపోయింది.

సుభాస్ చంద్రబోస్ రష్యాచేరి అక్కడ స్టాలిన్ మహాశయుడి సాయంపొందే ప్రయత్నంచేశాడు. తరువాత బోస్ జర్మనీ వెళ్ళి హిట్లరుతో కలసి ఆయన సాయమూ అర్థించాడు. 1942లో సింగపూర్, జపాను చేతిలో ఓడిపోయింది. అలా ఓడి యుద్ధఖైదీలుగా మారిన భారతీయులైన సింగపూర్‌లోని సైనికులను సంఘటిత పరచి "అజాద్ హింద్ ఫౌజ్" అనేదాన్ని స్థాపించాడు బోస్. అయితే బోస్ బ్రిటిష్‌వాళ్ళను ఓడించి భారతదేశానికి స్వాతంత్ర్యం సంపాదించాలనే ఆయన ఆశయం, ఆయన అకాల మరణంతో తీరకుండా మిగిలిపోయింది.

# అమరవీరుడు భగత్‌సింగ్



భగత్‌సింగ్ (1907-1931)

దేశ స్వాతంత్ర్యం కోసం ఆత్మబలిదానం చేసిన వాళ్ళు చాలామందివున్నా - "షహీద్-ఎ-ఆజమ్ (విప్లవ వీరుల్లో-చక్రవర్తి")గా ఆచంద్రతారార్కకీర్తిగడించినవాడు ఒక్క భగత్‌సింగే!

నూనూగు మీసాలనూతన యవ్వనంలో ప్రాపంచికసుఖాలు వదలుకున్న నిస్వార్థపరుడు, స్వయం శక్తితో ఉపాధ్యాయుడుగా పనిచేస్తూ, విద్యాదానం చేస్తూ. పదిహేడవయేట ఉద్యోగిగా ఉండి, వరదల్లో నిర్వాసితులైన అనేక వేల మందికి సేవ లందించిన మహనీయుడు భగత్‌సింగ్. పంధొమ్మిదవ ఏట రైతుకూలీ ప్రజాసేవ కోసం జాతీయోత్సాహం చేయటానికి "నౌజవాన్ భారత సంస్థ"ను ఇరవయ్యో ఏట మహాత్మాజీ కంటె దూరపు దృష్టితో స్వాతంత్ర్యసమర శంఖారావాన్ని ఊది, యువకులను తన ప్రాణత్యాగంతో ప్రోత్సహించినవాడు భగత్‌సింగ్.

అసలు జరిగిన సంఘటనలు.

1928లో బ్రిటీష్ ప్రభుత్వం ఏడుగురుసభ్యులతో 'సైమన్' అధ్వర్యంలో (సైమన్ జడ్జి-ఆ ఏడుగురిలో అతనూ ఒకడు) ఒక

కమీషన్‌ను నియమించింది. భారతీయులకు స్వపరిపాలన చేసుకునే శక్తి వున్నదో లేదో భారతదేశంలోని ముఖ్య నగరాలు పర్యటించి ఆ కమీషన్ ప్రభుత్వానికి ఒక వినతి పత్రం సమర్పించాలి. అయితే ఈ కమీషన్ సభ్యులు ఏడుగురూ బ్రిటీషువాళ్ళు కావటంవల్ల, దాన్ని, అది ఇవ్వబోయే రిపోర్టును ముందే ఊహించిన స్వాతంత్ర్య సమర యోధులు "సైమన్ వెనక్కు వెళ్ళు! మీ బ్రిటీషువాళ్ళ నాటకాలు ఇంక చాలు" అంటూ ఆ సైమన్ కమీషన్‌ను వ్యతిరేకిస్తూ పెద్ద ప్రజా ఉద్యమం ప్రారంభమైంది.

లాహోర్‌కు ఆ సైమన్ కమీషన్ బృందం వచ్చినప్పుడు ఆ సభ్యుల్లో కొందరినైనా చంపటానికి భగత్‌సింగ్, బాంబులు వేయాలని పథకం వేశాడు. అయితే బాంబుల తయారీకి తగినంత డబ్బు లేక ఆ పథకం అమలుకాలేదు.

లాహోరులో, లాలాలజపతిరాయ్ నాయకత్వంలో (ఆయన పంజాబు సింహ బిరుదాంకితుడు) భగత్‌సింగ్ బృందం కృషివల్ల ప్రజ లంతా ఎక్కువ సంఖ్యలో సైమన్ కమీషన్‌కు ఎదురు నిలిచారు. నగరమంతా గొప్ప హర్తాళ్ జరిగింది.

పోలీసు డిప్యూటీ సూపరెంటెంట్ సాండర్స్ అవసరమైతేపోలీ సులకు ఫైరింగ్ ఆర్డర్స్ తను స్వయంగా ఇవ్వటమేకాక, విచక్షణా రహితంగా తనే ముందుగా లాఠీచార్జి చేస్తున్నాడు. వృద్ధుడైన లాలా లజపతిరాయ్‌ను కాపాడాలని యువకులు వలయంగా నిలపడివున్నా ఆ జన సందోహం అదుపు తప్పింది. సాండర్స్ కొట్టిన దెబ్బలకు లజపతిరాయ్ శరీరం రక్తం చిమ్ముతోంది. ఆయన చొక్కా, వీపు, తల, తడిసిపోయాయి. ఆయన్ను వెంటనే అక్కడి నుంచి కొందరు కార్యకర్తలు, తీసికెళ్ళాలని ప్రయత్నం చేశారు.

అయితే లజపతిరాయ్ అనర్గళంగా ఉపన్యాసం చెబుతూ "నా వంటిమీద బ్రిటీషువాళ్ళు కొట్టిన దెబ్బలు—బ్రిటీషువారి పాలనకు అంత్యక్రియలు" అని, తన చొక్కా విప్పి, ఘోరంగా రక్తసిక్తమై గాయమైన, తనవీపు, భుజాన్ని అక్కడ సమావేశమైన యువకులకు

చూపారు. తరువాత ఆయన పద్దెనిమిది రోజులకు ఆసుపత్రిలో ఆ గాయాలతోనే మరణించారు.

అంతే! ఉద్యమకారులు కోపంతో రెచ్చిపోయారు. తమ జాతీయ నాయకులను లాఠీలతో కొట్టి చంపిన తెల్లదొరలను చంపితేనే కాని బ్రిటీషు వాళ్ళకు గుండెల్లో గుబులు పుట్టదని భగత్‌సింగ్ బృందం నిర్ణయించుకుంది. ఆ పని తన చేతులతో చేయటానికి భగత్‌సింగ్ స్వయంగా నిర్ణయించుకున్నాడు. పోలీసు అధికారి సాండర్స్ పని పట్టాలనుకున్నారు పథకం సిద్ధమైంది. భగత్‌సింగ్, రాజగురు, జయ గోపాల్ సాండర్సన్ ఆఫీసుకు వెళ్ళటానికి మలుపు తిరుగేచోట కాపు వేశారు. అతను రోజూ ఓ ఎర్రమోటార్ సైకిల్ మీదవస్తుంటాడు. జయ గోపాల్, చెడిపోయిన సైకిల్ బాగుచేస్తూ అక్కడ దారిలో ఆగి ఉన్నట్టు నిలబడ్డాడు. సాండర్స్ రాక తెలియచేయటానికి జయ గోపాల్ సైగచేశాడు. రాజగురు, భగత్‌సింగ్‌లు, పిస్తోళ్ళు గురిచూసి పేల్చారు. రాజగురు పేల్చిన పిస్టల్ బుల్లెట్ దెబ్బ, తలకు తగిలిన సాండర్స్ ఎగిరి క్రింద పడ్డాడు. భగత్‌సింగ్ వెంటనే ముందుకు వచ్చి సాండర్స్‌మీద వరుసగా నాలుగైదు కాల్పులు జరిపాడు. తరువాత మిత్రులు ముగ్గురూ అక్కడ నుంచి తప్పించుకు పారిపోయారు.

తరువాత "లాలాజీ హత్యకు ప్రతీకారం చేశాం-ఇంక్విలాబ్ జిందాబాద్-విప్లవం వర్ధిల్లాలి" - అంటూ పెద్ద పెద్ద వాల్‌పోస్టర్లు లాహోరులో ఎక్కడ చూసినా కనిపించాయి.

తనుచేయవలసిన పనులు ఇంకా ఎన్నో వుండటంతో భగత్ సింగ్ లాహోర్ నుంచి కలకత్తాకు ప్రయాణమయ్యాడు. పోలీసులు, గూఢచారులు తనకోసం వెయ్యికళ్ళతో వెదుకుతుండటంవల్ల, దుర్గాదేవి అనే ఆదర్శ మహిళ, తన బిడ్డతోసహా అతని భార్యగా నటించి రైలు ప్రయాణంలో సాయపడింది. భగత్‌సింగ్ తన గడ్డాన్ని, తల కేశాల్ని తొలగించి, దొరటోపి ధరించి, పెద్దదొరలా నటించసాగాడు. అనుక్షణం తనను నీడలా వెంటాడుతున్న గూఢచారుల, పోలీసుల చేతుల్లో పడకుండా అనుక్షణం తనను తాను కాపాడుకోవటానికి

భగత్‌సింగ్ ఎప్పుడూ తన దుస్తులను, వేషాన్ని, భాషను స్థలాన్నిబట్టి మారుస్తూ ఉండేవాడు. అయితే విప్లవకేంద్రాలు స్థాపించి విప్లవకారుల్ని తయారుచేయటంలో, బాంబుల కేంద్రాలు నెలకొల్పటంతో, వాటి వనరుల సేకరణలో అహర్నిశలు మునిగి ఉండేవాడు.

1929లో భారతపౌరులకు ఏవిధమైన ప్రాథమికహక్కులు లేకుండా చేసే చట్టం కార్మికుల ప్రాథమిక హక్కులు దోచే చట్టం చేయటానికి వైస్రాయికుండే నిరంకుశాధికారం ద్వారా బ్రిటీషు పాలకులు ప్రయత్నం మొదలుపెట్టారు. జాతీయ నాయకులంతా పార్లమెంటులో ఈ క్రొత్త చట్టాలను ఎంత వ్యతిరేకించినా బ్రిటీషు వారి ఎత్తుగడ ఏ విధంగా ఉంటుందో భగత్‌సింగ్‌తోపాటు అనేక మంది జాతీయ నాయకులు అర్థం చేసుకున్నారు. బ్రిటీషు దమన నీతికి బుద్ధి చెప్పి ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయటానికి తనవంటి కొందరు ప్రాణత్యాగంచేస్తే తప్ప లాభంలేదని అర్థం చేసుకున్నాడు. భగత్‌సింగ్.

1929లో ఏప్రిల్ నెల మొదటి వారంలో ఢిల్లీ పార్లమెంటులో పై బిల్లులు ఆమోదించినట్టు బ్రిటీషు ప్రభుత్వాధినేత ప్రకటించగానే భగత్‌సింగ్ మొదటి బాంబు ప్రేక్షకుల గ్యాలరీ నుంచి బ్రిటీషు ముఖ్యాధికారులు కూర్చునే స్థలాల్లోకి విసిరాడు. అది పెద్ద ధ్వనితో పేలింది. తరువాత బటుకేశ్వర్‌దత్ విసిరిన రెండో బాంబు కొద్ది వ్యవధిలో పేలింది. ఎవరికీ గాయాలు తగలలేదు. పేలినవి బ్లాంకు బాంబులు కావటాన ప్రమాదం జరగలేదు. భగత్‌సింగ్ తప్పించుకుపోవటానికి అవకాశంవున్నా— "ఇంక్విలాబ్ జిందాబాద్" అంటూ కరపత్రాలు ఎర్రరంగువి విసిరాడు. తను వచ్చిన పని పూర్తయినందువల్ల భగత్‌సింగ్, తనను అరెస్టు చేయటానికి భయపడుతున్న రక్షణాధికారి, సార్జంట్ టెర్రీతో "భయపడకు ! ఈ బాంబులు మేమే విసిరామని లోకానికి చాటుతాం! అరెస్టు చేసెయ్ !" అన్నాడు. చేతులు ముందుకు చాచుతూ.

కేసునడిచింది. 1930 అక్టోబరు 7 వ తేదీన ప్రత్యేక కోర్టు జడ్జిమెంట్ ప్రకటించ వలసి వుంది. అంతకుముందు భగత్‌సింగ్‌వున్న ఖైదులో, ఖైదీల దుస్థితి మారాలని భగత్‌సింగ్ ఆమరణ నిరాహారదీక్ష పూనాడు. అతనితో పాటు నిరాహారదీక్ష పూనిన జతిన్ బెంగాలుకు చెందిన మరో జాతీయ నాయకుడు, ఆ నిరాహార దీక్షలోనే చని పోయాడు. అతని చావుతో దేశవ్యాప్తంగా పెద్ద అలజడి రేగింది. ఇక భగత్‌సింగ్ పరిస్థితి ఘోరంగా తయారయింది. బ్రిటిష్ ప్రభుత్వం దిగివచ్చి వెంటనే ఖైదీల స్థితిగతులను మెరుగుపరచే కార్యక్రమాలు చేపట్టింది.

భగత్‌సింగ్‌లాంటి వీరులు బ్రతికివుంటే ప్రమాదమని గుర్తిం చిన బ్రిటిషు ప్రభుత్వం వెంటనే ఒక ప్రత్యేక కోర్టు ఏర్పాటుచేసింది. తనను తన అనుచరులను రాజకీయ ఖైదీలుగా నియమించాలని, మామూలు హంతకులుగా చేతులకు బేడీలు వేయరాదని భగత్‌సింగ్ కోరాడు. అయితే పోలీసులు ఆ విన్నపాన్ని మన్నించకపోగా, భగత్ సింగ్ ఎదురు తిరుగగా, అతన్ని కర్రలతో, చెప్పులతో కొట్టారు. ఇదంతా పై అధికారుల వత్తాసుతో జరుగుతున్నట్టు తెలిసిన విప్లవ నాయకులు భగత్‌సింగ్‌ను ఒక దశలో ఖైదునుంచి తప్పించాలనీ చూశారు. విప్లవ వీరుడు చంద్రశేఖర్ ఆజాద్ ఈ విషయంలో ఎంతో ప్రయత్నించాడు. అయితే భగత్‌సింగ్ అందుకు ఒప్పుకోలేదు. అను కున్నట్టే భగత్‌సింగ్‌తోపాటు, రాజగురు, సుఖదేవ్‌లకు ఉరిశిక్ష ప్రక టించి ప్రత్యేక కోర్టు అప్పీలు చేసుకునే వీలుకూడా లేకుండాచేసింది. బ్రిటిషు వాళ్ళు నడిపిన న్యాయవిచారణ న్యాయ విచారణకాదని, అది వొట్టి బూటకమని తెలిసిన భగత్‌సింగ్ తనకాలాన్ని పుస్తక పఠనంలో గడిపాడు.

రాజద్రోహం నేరం క్రింద తమకు పడ్డ శిక్షహంతకులకు చేసినట్టు ఉరితో అమలుచేయకుండా, తుపాకులతో కాల్చి చంపమని అప్పీలు చేశాడు భగత్‌సింగ్! అయితే ప్రభుత్వం ఆ శిక్షను అమలు చేసే విధానాన్ని మార్చలేదు.

జైలులో వున్న అన్నను చూడటానికి భగత్‌సింగ్ తమ్ముడు కుల్తార్ వెళ్ళాడు. కాళ్ళకు, చేతులకు బేడీలతోవున్న అన్నను చూసే సరికి అతనికి ఏడుపు ఆగలేదు. గొంతు బాధతో మూగ పోయింది. అదేవిషయం భగత్‌సింగ్ ఉత్తరం వ్రాస్తూ "ధైర్యంగావుండు! పిరికివి కావద్దు! మనిషి వ్యక్తిత్వాన్ని కోల్పోకూడదు తమ్ముడూ!" అంటూ ధైర్యం చెప్పాడు భగత్‌సింగ్.

భగత్‌సింగ్ వంటి విప్లవవీరుణ్ని చంపటానికి బ్రిటిషు ప్రభుత్వము భయపడింది. జైలు నిబంధనలకు వ్యతిరేకంగా, రాత్రి చీకటి పడబోతుండగా, ఉరిశిక్ష అమలు విషయం ఒక జైలర్ చెప్పటానికి వెళ్ళగానే "నేను రెడీగా వున్నాను! మీదే ఆలస్యం!" అంటూ సంతోషంగా అతని వెంట నడిచాడట, భగత్‌సింగ్.

జైలులోపల ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన ఉరికంబం దగ్గరకు రాగానే "ఇంక్విలాబ్ జిందాబాద్"—సామ్రాజ్యవాదంనశించాలి."— "వందేమాతరం" అన్నారట, ముగ్గురు వీరులు.

ఉరికి ముందు ఒక శిక్కుమతగురువు, దైవప్రార్థన చేసుకోమని భగత్‌సింగ్‌ను కోరగా, "జీవితంలో నేను దేవుణ్ని ఎప్పుడూ తలచుకోలేదు! నా దేశస్తులను, ఇన్ని కష్టాల్లో పడేసినందుకుదేవుణ్ని నిందించాను! మృత్యువుతో ముఖాముఖిగా వున్న ఈ క్షణంలో పిరికివాడుగా ఆత్మద్రోహం చేసుకొని ప్రార్థన చేయను! అన్నాడట. ఉరితీశాక ముగ్గురు మహావీరుల దేహాలను ఆంగ్లాధికారులు గోతాలలో కుక్కి, జైలు బయటకు తీసికెళ్ళారు. అక్కడ వారి మృతదేహాలు ఖండఖండాలుగా నరికి, వాటిమీద కిరసనాయిలుతో నిప్పంటించిన ఆంగ్లేయాధికారులు ఆనందంతో నృత్యం చేశారట! అలా అమరుడైన భగత్‌సింగ్ వయసు యిరవైనాలుగేళ్ళు.

## పిట్టకొంచెం కూతఘనం

# లాల్ బహదూర్ శాస్త్రి

అవి, స్వాతంత్ర్యసమరం ముమ్మరంగా సాగుతున్నరోజులు. జాతినంతటినీ ఒకే తాటిపై నడపగల గాంధీజీ, ఆయన ప్రియశిష్యులు అనుయాయులు చాలామంది జైళ్ళలో మ్రగ్గుతున్నారు.

జైళ్ళనుండిబయటి వారికిస్ఫూర్తినిస్తుంటే, చిన్నవయసులో వున్న యువకులు, ఉత్సాహంగా బయటఉండి స్వాతంత్ర్య సమర శంఖారావం పూరిస్తున్నారు.

ఆ సమయంలో భారత దేశంలోని నగరాలన్నీ ఒక ఎత్తయితే, ఒక్క అలహాబాదు వొక్కటీ వొకఎత్తయి, జాతీయనాయకులకు దేశభక్తులకు వెన్నుతట్టి నిలిపే కేంద్రమయ్యింది. దీనికి కారణం అలహాబాదులో, మోతీలాల్ జవహర్‌లాల్ నెహ్రూల ఆనంద భవన ముండటమే కారణం.

అలాటి అలహాబాదు మహానగరానికి, మకుటాయమానమైన కూడలి క్లాక్‌టవర్ సెంటర్. ప్రతిరోజూ జాతీయ నాయకులంతా అక్కడచేరి ప్రసంగాలు, సమావేశాలు, తీర్మానాలు, తరువాత జరగవలసిన కార్యక్రమాల పథకరచన చేసేవారు.

ఆ కూడలిస్థలికి అలా ప్రాధాన్యత రోజురోజుకూ పెరిగి పోయింది. అయితే అక్కడ పెద్ద ఎవరెస్టు శిఖరంలా ఎత్తుగావున్న క్లాక్‌టవర్‌మీద మాత్రం జాతీయజండా ప్రతిష్ఠాపన జరగలేదు. దానికి ముఖ్యకారణం ఆ క్లాక్‌టవర్ పైకి ఎక్కటానికి ఒంటిస్తంభం మేడకున్నట్లు మెట్లున్నా, అవి లోపలినుండి ఎక్కాలి. పైగా బైటఎప్పుడూ

నలుగురైదుగురు సాయుధ పోలీసులు, ఒక ఇన్‌స్పెక్టర్ కాపలా ఉంటారు. ఈ కారణంచేత, ఆ క్లాక్‌టవర్‌మీద జాతీయజెండా ప్రతి ష్టాపన జరగలేదు.

అయితే ఇదే విషయం, జాతీయనాయక శ్రేణిలో చర్చకు వచ్చినప్పుడు, పోలీసులు కాపలావుండగా జెండా ప్రతిష్ఠాపన, అంత పైకివెళ్ళి చేయుటం ఎలా సాధ్యమో ఎవ్వరికీ తోచలేదు చివరికి కార్యా చరణ ఎలా సాధ్యమో అరుణా అసఫాలీ సోదరి శ్రీమతి పూర్ణిమా బెనర్జీ, ఒక పథకంగా చెప్పింది. అదైనా అమలు చేయటానికి ఎవరూ సాహసించలేక పోయారు

క్లాక్‌టవర్‌మీద జెండా ప్రతిష్ఠాపన చేయాలని కొందరు జాతీయనాయకులు ప్రయత్నిస్తున్నట్లు పోలీసులకు తెలిసి, వాళ్ళు ముందుచర్యగా, తమ సంఖ్యను ఇంకా ఎక్కువగా పెంచి, క్లాక్‌టవర్ చుట్టూ వలయాకారంగా ఉండి బందోబస్తు సాగించారు క్లాక్‌టవర్ ఎక్క డానికి మామూలుగా మగవాళ్ళని అనుమతించకుండా ఆపివేశారు. ఆడవాళ్ళనుకూడా ఒకళ్ళ తరువాత ఒకళ్ళు పైకివెళ్ళి నగర సౌంద ర్యంచూసి తిరిగి వచ్చే ఏర్పాటు చేశారు.

ఇలా కొన్నాళ్ళు సాగగా ఓ రోజు బురఖా ధరించిన ఓ స్త్రీ తెరలు కట్టిన బగ్గీలోనుంచి దిగింది. ఆమె దుస్తులు, దర్పము చూసిన పోలీసులు, ఆమెను ఏ నవాబు కుటుంబీకురాలోనని "జాయియే మేంసాబ్! జాయియే!" అంటూ, క్లాక్‌టవర్ ఎక్కడానికి లోపలికి అనుమతించారు.

అయితే ఎవరూ ఊహించని విధంగా "ఝుండా ఊంచా రహే హమారా!" అంటూ అరుస్తున్న జనసందోహపు గొంతులు విని పించాయి.

తెలుసుకునే లోపల క్లాక్ టవర్ మీద జాతీయ జెండా రెపరెప లాడి పోతుంది.

అంతమాయగా, జండా ప్రతిష్ఠాపన ఎలా జరిగిందో వాళ్ళకు అంతుపట్టలేదు.

ఇంతలో "భారతమాతకుజై-మహాత్మాగాంధీకీజై-"అంటూ జయజయ ధ్వానాలు దిక్కులు పిక్కటిల్లేలా వినిపించినయ్.

ఇంతలో నల్లటి బురఖా ధరించిన ఆ ఘోషాస్త్రీ, ధోవతీ పంచె, తలకు గాంధీ టోపీతో పోలీసుల ముందుకువచ్చి నిలిచాడు.

పోలీసులకు మతిపోయి ఏంచేయాలో అర్ధంకాక చూస్తుంటే "నేనే జెండా ప్రతిష్టాపన చేశాను. అలా నా జాతీయ జెండాను గౌర వించాను. నాపని నేను చేశాను—మీపని మీరు చేయండి"! అన్నాడు, అరెస్టు చేయమని లొంగిపోతూ.

పోలీసులు ఆ యువకుణ్ణి గుర్తించారు! అతను మనిషిపొట్టి వాడైనా బాగా గట్టివాడని, అలా జాతీయోద్యమకారుడుగా, అతనికి జైలుకు వెళ్ళటం కొత్తకాదని, ఆయనే లాల్ బహాదూర్ శాస్త్రి-అని.

మరో మార్గంలేక పోలీసులు శాస్త్రిగారిని అరెస్టు చేశారు. మేజిస్ట్రేటు ఆయనకు ఆరునెలలు జైలుశిక్ష వేశాడు. అలా ఎవరూ సాధించలేని అనేక మంచి పనులు సాధించి "పిట్ట కొంచెమైనా కూత ఘనం" అన్న సామెతను రుజువు చేస్తూ, తన నిజాయితీ, ఋజువర్త నలతో భారతదేశ ద్వితీయ ప్రధాని అయిన, అమరుడు లాల్ బహాదూర్ శాస్త్రి.

## ధైర్యసాహసాలకు మారుపేరు
## శ్రీమతి ఇందిరాగాంధి

"పులి కడుపున పులే పుడుతుంది" అన్న నానుడి దివంగత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ విషయంలో, అక్షర సత్యమైపోయింది.

శ్రీమతి ఇందిర పసిపిల్లగా ఉండగానే అలహాబాదులోని, ఆనందభవనం పెద్ద జాతీయోద్యమ కేంద్రం! స్వయంగా ఆమె తాత మోతీలాల్ జాతీయోద్యమంలో పాల్గొనంటచేత, ఆయనకు శిక్షపడ బోతున్న సమయంలో కూడా-బాలఇందిర ఆయనతోపాటు బోను ఎక్కేది! తనూ జైలుకు వెళ్ళేది.

అటు తండ్రి, తల్లి, మేనత్తలు, స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొంటుంటే ఆమె పన్నెండేళ్ళ అతి చిన్న వయసులోనే, చిన్న "వానర సేన"ను ప్రారంభించి, దానికి నాయకత్వం వహించింది. అప్పటి ఆమె ముద్దుల పేరు-" ఇందిరాప్రియదర్శిని. మొదట కొద్ది మంది బాలబాలికలతో ప్రారంభమైన ఆ సేన క్రమేపి సంఖ్య ఆంజనేయుల వారి తోకలా పెరిగిపోయింది.

స్వాతంత్ర్య సమరంలో పాల్గొంటున్న జాతీయనాయకులకు అన్ని విధాలా సాయం అందించటం, గాయపడిన వారిని సురక్షిత ప్రాంతాలకు చేర్చటం, ప్రాథమిక చికిత్స చేయటం, పోలీసు అధి కారుల రాకను గురించి ముందుగా జాతీయ నాయకులకు తెలియ జేయటం, జాతీయ నాయకుల మధ్య చేరవలసివున్న రహస్య సమాచారాలు అందించటం, ప్రజల్లో జాతీయ భావాలు నాటుతూ జాతీయ గీతాలు పాడటం, కరపత్రాలు పంచటం లాంటివి చేసేవాళ్ళు.

ఒకసారి అలహాబాదులోని ఆనందభవనం సమీపంలోనే పోలీసు అధికారులు, సభలు, సమావేశాలు జరపరాదంటూ నిషేధాజ్ఞలు అమలు చేశారు.

అయినా జాతీయ నాయకుల ఆధ్వర్యంలో పెద్ద ఊరేగింపు బయలుదేరింది. తెల్లదొరలు పెద్ద సంఖ్యలో పోలీసు బలగాలను రంగంలోకి దింపి, లాఠీచార్జీచేసి వెంటనే కాల్పులు ప్రారంభించారు. అయినా ఉద్యమకారులు వెనక్కు మరలలేదు. వాళ్ళు ఇంకా ముందుకేసాగే ప్రయత్నంచేశారు. అదుపు తప్పిన జనాన్ని అదుపులోనికి తేవటానికి పోలీసులు విచక్షణా రహితంగా తూటాలు పేల్చారు. ఇక క్షతగాత్రుల సంఖ్య లెక్కకు మించిపోయింది. రక్తం ఓడుతూ, బాధతో వందల సంఖ్యలో ఉద్యమకారులు నేలకొరిగారు.

వారిలో కొందరి పరిస్థితి చాలా ఘోరంగా ఉంది. కొందరు ఆ తుపాకీ తూటాలకు నేలకొరిగితే, కొందరు శాశ్వతంగా ఈ లోకం విడిచారు. కొనవూపిరితోవున్న కొందరు "దాహం ! దాహం" అంటూ కేకలు వేస్తున్నారు.

అయితే అవసాన దశలోవున్న ఆ క్షతగాత్రుల్ని ఆదుకోడానికి ఎవరూ ముందుకు రావటంలేదు. అలా వచ్చిన వారిని కాల్చి చంపటానికి బ్రిటీషుదొరలు, తుపాకులతో పోలీసు బలగాలతో, సిద్ధంగా ఉన్నారు.

దేశ స్వాతంత్ర్య సమరంలో తమ ప్రాణాల్ని తృణప్రాయంగా త్యజించటానికి వెనకాడని ఆ త్యాగమూర్తులను, ఆ అవసానదశలో ఆదుకునేవారే లేకపోయారు.

దూరంగావున్న కొందరు అసహాయంగా భయంగాచూస్తూ పూరుకుంటున్నారు. ఇంతలో, చిచ్చర పిడుగలా, తన వానరసేనతో ఇందిరా ప్రియదర్శిని, వేల సంఖ్యలోవున్న తన అనుయాయులతో, అక్కడ ప్రత్యక్షమయ్యింది.

అంత మంది చిన్న పిల్లలు ఒక్కసారి మిడతల దండులా వచ్చి పడటంతో, బ్రిటీషు అధికారులకి ఏం చేయాలో తోచలేదు! కొన ప్రాణాలతోవున్న వీరుల్ని ఎత్తుకొనితెచ్చి ఇందిరాప్రియదర్శిని వాళ్ళను ఆనంద భవనంలో చికిత్సకోసం చేర్పించసాగింది. కొద్దిసేపటిలోనే ఆమె వందల మంది క్షతగాత్రుల ప్రాణాలు కాపాడగలిగింది. అంత చిన్న వయసులో, అందరు జాతీయ నాయకుల ప్రాణాలు కాపాడిన ఆమె ధైర్యసాహసాలను, మహాత్మాగాంధీకూడా అభినందిస్తూ ఉత్తరం వ్రాశారు.

ఇది జరిగిన కొన్నేళ్ళకు, ఇందిరాగాంధి విశ్వకవి ఠాగూర్ శాంతి నికేతన్‌లో, ఇంగ్లాండ్‌లోని ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో, విద్య ముగించి ఇంటికొచ్చింది.

అప్పుడు స్వాతంత్ర్య సమరం మహాత్మాగాంధీ, నెహ్రూ, పటేల్ వంటి మహామహుల ఆధ్వర్యంలో అత్యంత తీవ్రస్థాయిలో జరుగుతోంది.

అప్పటి బ్రిటీషు ప్రభుత్వం, మూడురంగుల భారత జాతీయ జెండా పట్టిన వారినందరినీ కారాగారాల్లో బంధిస్తోంది. జండా ప్రతిష్ఠాపన కోసం ఎవరైనా ప్రయత్నిస్తే, వారిని ఘోరంగా పోలీసులు లాఠీలతో చావగొట్టేవాళ్లు.

ఒకరోజు అలహాబాద్‌లో జాతీయజండా ప్రతిష్ఠాపన జరగబోతోంది. అప్పటికే జాతీయ నాయకులంతా జైళ్ళల్లో మగ్గుతున్నారు. ఇక స్వాతంత్రోద్యమ కార్యక్రమాలన్నీ నడుపవలసిన బాధ్యతలు యువతీ యువకులమీదే పడ్డాయి.

జండా ప్రతిష్ఠాపన కార్యక్రమంలో ఆ రోజు ఇందిరా ప్రియదర్శినీ ఉంది. జండా ప్రతిష్ఠాపన జరగబోతున్న సంగతి తెలిసి అది నిరోధించటానికి స్వయంగా పెద్ద పోలీసు దొరతే రంగంలోకి దిగారు,

జాతీయగీతం ఆలపిస్తూ ఓ యువకుడు మొదట జండా కర్రను పైకెత్తాడు.

అంతే ! !

అంత వరకు పొంచి ఉన్నట్లున్న పోలీసులు, ఒక్కసారిగా అతని మీదపడి తమ లాఠీలతో అతన్ని బాదసాగారు.

అయినా అతను తనచేతిలోని కర్రకు గట్టిగాపట్టి "వందే మాతర-వందేమాతరం" అంటూ అరవసాగాడు.

అతను ఎలా అరిచాడో, దానితో స్ఫూర్తి పొందిన తక్కినవాళ్లుకూడా "వందేమాతం—వందేమాతరం" అంటూ మరింత బిగ్గరగా ప్రతిస్పందిస్తూ అరచారు.

దానితో రెచ్చిపోయిన పోలీసులు లాఠీ దెబ్బలను మరింత ఘాటుగా పెంచి, పిడుగుల్లా ఆ ఉద్యమకారుల మీదకు దుమికారు.

చేతిలో జాతీయ జండావున్న యువకుడి మీద పడ్డ ఓ తెల్ల పోలీసు అధికారి, అతని మోచేతిమీద, మణికట్టుమీద వర్షాపాతంగా లాఠీ దెబ్బలు కొట్టాడు. ఆ దెబ్బధాటికి ఆ యువకుడి మణికట్టు విరిగింది. ధారగా రక్తం కారుతోంది.

అయినా ఆ యువకుడు"వందేమాతరం"అంటూనేఉన్నాడు. అతని విరిగిన మణికట్టుమీద ఇంకా దెబ్బలు పడుతూనే ఉన్నాయ్. అతని చెయ్యి పట్టుతప్పుతోంది. చేతిలో పట్టుకున్న జండా కర్ర, దానితోపాటు జండా విరిగిపోతోంది.

ఆ దెబ్బలధాటికి తాళలేక ఆ యువకుడు స్పృహకోల్పోయి పడిపోయాడు. అతని చేతిలోని జండా నేలమీద పడబోతుండగా, మెరపులా ఇందిరా ప్రియదర్శిని ఆ జండా అందుకుంది.

అంత వరకు ఆ యువకుడిమీద కోపంతో వున్న పోలీసు అధికారులు ఇప్పుడు తమ తెల్ల పోలీసు అధికారి సూచన మేరకు లాఠీచార్జి ఇందిరాప్రియదర్శిని మీదకు మళ్ళించారు.

క్రింద పడబోతున్న జండాను పైకెత్తి "ఝండా ఊంచా రహే హమారా" అంటూ సింహగర్జన చేసింది, ఇందిరాప్రియదర్శిని.

ఇక పిడుగుల వంటి లాఠీ దెబ్బలు ఆమె వీపుమీద,తలమీద' చేతులమీద సమ్మెటపోటుల్లా పడ్డాయి.

అలాంటి ఘోర అనుభవం ఎరుగని ఇందిరాప్రియదర్శిని ఆ బాధను సహిస్తూనే "వందేమాతరం-వందేమాతరం" అంటూ అరుస్తోంది.

పోలీసులు రెచ్చిపోయి, ఆమెమీద తమ లాఠీల ప్రతాపం చూపటం ఇంకా అధికం చేశారు.

ఆమెకు ఆలాఠీదెబ్బలు భరింపరానికిబాధగావున్నా, కనీసం ఆమె చేతులుకూడా అడ్డుపెట్టుకోలేదు· ఆమెకు ఆమె తల్లి, తండ్రి తాతలు చేస్తున్న త్యాగాలు, తిన్న దెబ్బలు, పడ్డ శిక్షలు గుర్తుకొచ్చాయి. ఆమె రక్తంలో వారి నుండి పుణికి పుచ్చుకొన్న ధైర్య సాహసాలు ఒక్కసారిగా పెల్లుబికాయి. ఆమెకు ఇక ఆ దెబ్బలు బాధ ఒక బాధగా అనిపించలేదు. అంత చిన్న యువతిలో అంత మొండి ధైర్యానికి తెగువకి పోలీసులే ఆశ్చర్యపడ్డారు.

అయినావాళ్ళు ఇందిరాప్రియదర్శిని చేతినుంచి ఆజండాను, ఆ జండా వున్న కర్రను అంత మాత్రం కూడ కదిలించలేకపోయారు.

వాళ్ళు కోపంతో పిచ్చి వాళ్ళయిపోతూ ఆమెను స్పృహ కోల్పోయే వరకు లాఠీలతో కొట్టికొట్టి పడగొట్టారు.

ఇందిరాప్రియదర్శిని స్పృహ కోల్పోయినా ఆమె చేతిలో జాతీయ జండా మాత్రం సురక్షితంగా వుండి పోయింది. బాల్యంలో ఆమె ప్రదర్శించిన ఆ ధైర్యం, పట్టుదల ఆమె భారత ప్రధాని

# ఆదర్శ వైద్యుడు గయాన్

ఒక శతాబ్దం క్రితం వరకు, ప్లేగు అనే అంటు వ్యాధికి అసలు కారణం ఏమిటో ఎవరికీ సరిగా తెలియదు.

ఈ వ్యాధి వ్యాప్తికి కొన్ని రకాల క్రిములు కారణమని ప్రపంచానికి తెలిపిన మొదటి వ్యక్తి డాక్టర్ గయాన్.

ఫ్రాన్స్ దేశంలోని మార్సెల్స్ పట్టణంలో ఒకయేడు ప్లేగు వ్యాధి తీవ్రంగా వ్యాపించి వేల సంఖ్యలో జనం చనిపోతున్నారు. ఎవరైనా ప్రాణాలతో బతికి వున్నవారు దేశమే వదలి వలస పోతున్నారు. ఆ వ్యాధి సోకిన వాళ్ళకు వైద్యం చేయడంలేదు. వైద్యులు కూడా తమ ప్రాణ రక్షణ కోసం వైద్య వృత్తినే మానుకునే స్థితి ఏర్పడింది. అంతటి భయంకరమైన అంటువ్యాధి అది.

ఈ పరిస్థితి డాక్టర్ గయాన్ మనసు కలచి వేసింది. ఆయన అప్పుడు ఆ వృత్తిలో కొత్తగా ప్రవేశించిన యువకుడు. వైద్యుల నందరినీ ఆయన సమావేశపరచి "మిత్రులారా! ప్లేగువ్యాధి నివారణకు మార్గం కనుగొని, ప్రజలకు ప్రాణరక్షణ చేయవలసిన మనం ప్రాణ రక్షణకోసం పారిపోవటం మన వృత్తికే అవమానకరం. ప్లేగువ్యాధికి మూలకారణం ఏమిటో, ప్లేగువ్యాధితో చనిపోయిన వ్యక్తి శరీరాన్ని కోసి, పరీక్షించి తెలుసుకుందాం?" అన్నాడు.

ఆ మాటలు విన్న వైద్యులు నీ సలహా మంచిదే! కానిప్లేగు వ్యాధి ఎంత ప్రమాదకరమైన అంటువ్యాధో తెలుసు కదా! మరి ఆ వ్యాధి సోకి చనిపోయిన వ్యక్తి శరీరాన్ని కోసి పరీక్షించే ప్రయత్నంలో మనంకూడా ఆ వ్యాధికి గురై చనిపోతాంకదా! తెలిసి తెలిసి ప్రాణం మీదికి తెచ్చుకుని వైద్యం ఎలా చేస్తాం!?" అన్నారు.

అయితే ఆ మాటలకు సమాధానంగా గయాన్ నవ్వుతూ "ఒక్క ప్రాణత్యాగం చేయడంవల్ల భవిష్యత్తులో అనేక ప్రాణాలు కాపాడబడతాయని తెలిసీ మనం తాత్సారం చేయుటం తగదు! నేనే ఆ పరిశోధనకు నా ప్రాణం బలిచేస్తాను!" అన్నాడు. వైద్యులంతా విస్మయం చెందారు. కొందరు అలాంటి సాహసం తగదని వారించారు.

అయితే గయాన్ అధైర్యపడకుండా మరునాడే ప్లేగుతో చనిపోయిన వ్యక్తి శరీరాన్ని కోసి అనేక విషయాలు కనుగొని, వాటి, నన్నింటిని కాగితాలపై జాగ్రత్తగా వ్రాసి చనిపోయాడు. తరువాత అతని పరిశోధన ఆధారంగానే, ప్లేగువ్యాధి క్రిముల నివారణకు కృషి జరిగింది. డాక్టర్ గయాన్ ఆ విధంగా అమర వైద్యుడయ్యాడు.

# పాపం ఛార్లెస్ డికెన్స్

గొప్ప ఆంగ్లరచయితల్లో ఛార్లెస్ డికెన్స్ కున్న మంచి ఖ్యాతి, చాలా తక్కువ మందికుంది.

అతని నవలల్లో, కథల్లో, వ్యాసాల్లో వున్న వాస్తవికత, వ్యంగ్యం, హాస్యం, తక్కిన సాహిత్య విలువలు, మరే రచయిత రచనల్లో కానరావు.

డికెన్సు బాల్యంలో పడ్డ కష్టాలు, కడగళ్ళు, నిరాశలు, నిస్పృహలు మరే రచయితా తన నిజ జీవితంలో పడి వుండడు, దాని ఫలితమే అతని రచనల్లో మనకు కనిపించే వాస్తవికతకు కారణం.

సంఘ దురాచారాలను 'పిక్‌విక్ పేపర్స్'లో మరే రచయిత, అంత సర్మగర్భితంగా విమర్శించలేదు.

అనాథ పిల్లలు పొందే ఇక్కట్లు, "ఆలివర్‌ట్విస్ట్" నవలలో కంటే మరెవరూ బాగా చిత్రించలేరు. యుద్ధపు అలజడిని, రెండు మహానగరాల కథ, (టేల్ ఆఫ్ టూ సిటీస్) లో కంటే మరెవరూ కళ్ళకు కట్టలేరు.

అలా గొప్ప ప్రఖ్యాతి పొందిన సాహితీవేత్త "క్రిస్టమస్ కెరోల్" అనే చిన్న క్రిస్టమస్ నవల వ్రాశాడు.

డికెన్స్ ఏ రచనా అంత ప్రఖ్యాతి పొందలేదు. రేడియో, సినిమా, టెలివిజన్ లకు, అందులోని కథను ఎందరెందరో వాడుకున్నారు. డికెన్స్ ఏ రచనా అన్ని పునర్ముద్రణలు కాలేదు.

దాదాపు ఒకటిన్నర శతాబ్దాలు కావస్తోంది ఆ పుస్తకం

వ్రాసి! అయినా ఇప్పటికీ అది "హాట్ కేక్"గా అమ్ముడయి పోతుంది.

ఎన్నోరాత్రులు మేల్కొని, తిండీ తిప్పలు సరిగా తినక, మనసంతా కేంద్రీకరించి రక్తమాంసాలు ధారపోసి, కొండంత ఆశతో ఆ "క్రిస్టమస్ కెరోల్" అనే నవలను డికెన్స్ వ్రాశాడు.

అప్పటి అతని వయసు 32 ఏళ్ళు! నలుగురు పిల్లలు, భార్య మళ్ళీ గర్భవతి, ఖర్చులు అదుపు తప్పి పెరుగుతున్నాయ్. రచన వృత్తిగా స్వీకరించినా పెద్దగా ఆదాయంలేదు.

తను అప్పుడు కొత్తగా వ్రాస్తున్న కొత్త నవల బాగా "హిట్" అయితే తప్ప తనకు, తన కుటుంబానికి భవిష్యత్తులేదు.

అందుకే డికెన్స్ తన ప్రతిభనంతా రంగరించి, ఆ రచనకు ధారపోశాడు.

అతను ఊహించిన దానికంటే నవల బాగానే వచ్చిందని, అది తన భవిష్యత్తుకు బంగారుబాట వేస్తుందని కలలు కన్నాడు డికెన్సు.

ఆశించినట్టే, మొదటిరోజే, అయిదు వేల కాపీలు అమ్ముడు పోయాయి.

రెండవ, మూడవ ముద్రణలుకావాలని, పబ్లిషర్స్‌కు ఆర్డర్లూ వచ్చాయి! నవల ఎంతో బాగుందని, ఉత్తరాల పరంపర డికెన్స్‌ను ముంచెత్తింది.

డికెన్స్ కూడా సంతోషించాడు!

కాని ఇంతలో, రచయిత అనుమతి లేకుండా కొందరు పబ్లిషర్స్ నకిలీ పుస్తకాలను అచ్చువేసి దేశం మీదకు వదిలారు.

ఈ నవలతో తక్కిన నవలలకూ బాగా గిరాకీ పెరగడంతో కొద్ది మార్పులతో ఆయన "ఆలివర్ ట్విస్ట్," "నికోలాస్ నికెల్‌బీ

వంటివి కూడా అచ్చు వేసుకుని వాటిని కూడా అన్ని దేశాలకూ దొంగతనంగా ఎగుమతి చేసి, కోట్లు గడించటం ప్రారంభించారు.

దీనితో ఆ నవలలు, అసలు కాపీరైటు హక్కున్న పబ్లిషర్స్ కాపీలు, గోడౌన్‌లోనే ఉండిపోయాయి.

"క్రిస్టమస్ కెరోల్" విజయంతో, ఏదో బాగుపడిపోదామనుకున్న డికెన్సుకు అసలు నయాపైస లాభం లేకుండా పోయింది

మరోమార్గంలేక డికెన్స్ కోర్టుకెక్కాడు. "ఇదివరకు తాము డికెన్స్ రచనలను పైరేట్ ఎడిషన్స్‌గా ప్రచురించినపుడు ఎవరూ అభ్యంతరం చెప్పలేదు! అందుకే ఈ "క్రిస్టమస్ కెరోల్" నవలను అచ్చువేసుకున్నాము!" అంటూ పైరెట్ ఎడిషన్ అనుమతి లేకుండా దొంగతనంగా రచనలను ముద్రించేవాళ్ళు వాదించారు.

కాని, జడ్జి డికెన్స్ తరపున తీర్పునిస్తూ "రచయిత కోరిన నష్టపరిహారం వెయ్యి పౌండ్లు రచయితకు ఇవ్వాలి ! ఇది ధర్మం !" అంటూ తీర్పు చెప్పాడు.

మరో మార్గంలేని పబ్లిషర్లు తాము దివాళా ఎత్తినట్టు, డబ్బు కట్టలేమని, తరువాత నిరూపించుకునే సాక్ష్యాధారాలుసృష్టించి కోర్టును నమ్మించారు.

కోర్టుకు ఎంతో ఆశతో, తన కష్టఫలం లభిస్తుందని వచ్చినందుకు చివరికి లాభం రాకపోగా కోర్టు ఖర్చుల క్రింద, లాయరు ఖర్చులు క్రింద "తడిసి మోపెడు" — అనే సామెత ప్రకారం అయ్యింది, డికెన్స్ పని.

చివరికి అన్ని ఖర్చులూ పోను, అతనికి అంత గొప్ప హిట్ నవల మీద దక్కింది కేవలం ఇరవైఆరు పౌనులు.

కష్టాల కడలిలో తన జీవితాన్ని గడిపినా, తన రచనల ద్వారా చరిత్రలో శాశ్వతంగా మిగిలిన డికెన్స్ గొప్ప రచయితగా మనలో మిగిలిపోయాడు.

—o—